# సాధకులకు విన్నపం

ఉపాసకులు గమనించవలసిన ప్రధాన విషయం ఏమిటంటే? ఏ మంత్ర సాధన అయినా గ్రంథాలు చూసి చేస్తే ఫలించదు. మహామంత్రాలని సిద్ధిపొందిన గురువుల నుంచి ఉపదేశాన్ని పొంది, ఆ గురువు ఆదేశానుసారం వారి సూచనల ప్రకారం సాధన చేస్తేనే దేవతానుగ్రహం మంత్రసిద్ధి కలుగుతుంది. అలాకాక స్వతంత్రించి గ్రంథాల్లోని మంత్రాలను ఉపాసిస్తే అవి వికటించి మేలుజరగక పోగా కీడు జరిగే అవకాశమే ఎక్కువ. అయితే లోకంలో కొంతమంది పండితులు దేవత భక్తుణ్ణి ఆదరిస్తుంది కానీ ఎప్పుడూ శిక్షించదు. కనుక భయపడాల్సిన పనిలేదని ఉద్బోధిస్తున్నారు. వీరి మాట శాంతదేవతల విషయంలో కొంత వరకూ నిజమైనప్పటికీ ఉగ్రదేవతా సాధనల్లో అది దక్షిణాచారమైనా వామాచారమైనా సరియైన పద్ధతిలో గురువు ఉపదేశం లేకుండా మార్గదర్శనం లేకుండా మంత్రసాధన చేస్తే ఇబ్బందులు వచ్చే అవకాశం చాలా వరకూ ఉంది. కనుక సాధకులు ఈ విషయాన్ని తప్పకుండా గమనించాలి. స్తోత్రాలు, కవచాలు, హృదయం వంటివి ఉపదేశం లేకపోయినా ఏకులంవారైనా స్త్రీలైనా పురుషులైనా నిర్భయంగా పారాయణ చేసుకోవచ్చు.

సాధకులు ఈ గ్రంథంలో తెలిపిన విధంగా మంత్రజపం చేసిన తరువాత, అలాగే స్తోత్రాల్ని పారాయణ చేసిన తరువాత తప్పనిసరిగా ఈ క్రింది శ్లోకాల్ని పఠించాలి.

**అపరాధ సహస్రాణి క్రియంతేఽహర్నిశంమయా ।**
**దాసోఽయమితి మాం మత్వా క్షమస్వ పరమేశ్వర(రి) ॥**
**యదక్షరం పదభ్రష్టం మాత్రాహీనంతు యద్భవేత్ ।**
**తత్సర్వం క్షమ్యతాందేవ(వి) పరమేశ్వర(రి) నమోఽస్తుతే ॥**

**గమనిక :**

ఈ గ్రంథంలో పేర్కొన్న దేవతామంత్రం 1 లక్ష జపానికి పురశ్చరణ ఏ విధంగా చేయాలో సవివరంగా తెలియచేసాము. ఇదే పద్ధతిలో ఇందులో ఇచ్చిన ఇతర మంత్రాలను కూడా ఆ మంత్రానికి చెప్పిన జపసంఖ్యను అనుసరించి సాధకులు తమ పురశ్చరణని కొనసాగించాలి.

# శ్రీ సుబ్రహ్మణ్య
# షోడశోపచార పూజావిధానం
## పురుషసూక్త సహిత పురాణపద్ధతి



షోడశోపచారములు అంటే 16 ఉపచారములు. అవి : 1.ధ్యానం, 2.ఆవాహనం, 3.ఆసనం, 4.పాద్యం, 5.అర్ఘ్యం, 6.ఆచమనీయం, 7.స్నానం, 8.వస్త్రం, 9.యజ్ఞోపవీతం, 10.గంధం, 11.పుష్పం, 12.ధూపం, 13.దీపం, 14.నైవేద్యం, 15.తాంబూలం, 16.నీరాజనం. ఇవి ప్రధానవమైన ఉపచారాలు. వీటితోపాటు మరికొన్ని ఉపచారాలు కూడా నిత్యషోడశోపచార పూజావిధానంలో చేరి ఉంటాయి.

ఇక్కడ పురుషసూక్త పద్ధతిలో పురాణోక్త శ్లోకాలను కూడా చేర్చి షోడశోపచార పూజావిధానాన్ని అందిస్తున్నాము. పురుషసూక్తము అనునది వేదోక్తమైనది కాబట్టి గురుముఖతః నేర్చుకున్నవారు మాత్రమే పఠించాలి. పురుషసూక్తం క్రింద ఇవ్వబడిన శ్లోకాలను అన్ని వర్ణాలవారు పఠించవచ్చు. ఈ విషయాన్ని గమనించి తమ నిత్యపూజను భక్తిశ్రద్ధలతో ఆచరించి శ్రీ  స్వామివారి అనుగ్రహాన్ని పొందగలరు.

**పూజా సామగ్రి :-** పూజకు “రాగిగ్లాసులో నీరు, రాగి ఉద్ధరిణె, రాగిపళ్ళెము, తీర్థపాత్ర, పుష్పములు, గంధము, ఘంట, అక్షతలు, యథాశక్తిగా పంచామృతము, గోక్షీరము, నైవేద్యమునకు పటికబెల్లం, కిసిమిస్ లేక ద్రాక్షగాని, అరటిపండ్లు గాని, వండిన పదార్థములతో మహానైవేద్యము. దీపము, ధూపము, హారతి, కర్పూరము వగైరా ముందుగా సిద్ధం చేసుకోవాలి.

తూర్పు ముఖముగా గాని, ఉత్తరముఖముగా గాని తాను కూర్చొని దైవారాధన చేయాలి. మనకు ఎదురు ముఖముగా ఆరాధ్యమూర్తి విగ్రహంగాని, చిత్రపటంగాని ఉండాలి.

ప్రతి నిత్యము వీలుండేవారు శిరస్స్నానము చేసి పూజ ప్రారంభించాలి. అలా వీలులేని వారు కంఠ స్నానమైనా చేసి పూజ చేయాలి. వారివారి సంప్రదాయం ప్రకారం తిరునామమో, గోపీచందనమో, విభూతియో తిలకధారణ చేసికొని పీటమీద కూర్చుని గణపతి పూజ ప్రారంభించాలి.

# శ్రీ విఘ్నేశ్వర పూజ

## ఆసనం

శ్లో॥ **పృథ్విత్వయా ధృతాలోకా దేవిత్వం విష్ణునాధృతా ।**
**త్వం చ ధారయ మాం దేవీ పవిత్రం కురు చాసనమ్ ॥**

పై శ్లోకాన్ని పఠించి దేవుడి ముందు ఏర్పరచుకొన్న ఆసనము మీద కూర్చోవాలి.

## గణపతి ప్రార్థన - గురుప్రార్థన

శ్లో॥ **శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।**
**ప్రసన్నవదనం ధ్యాయే స్సర్వవిఘ్నోపశాన్తయే ॥**

శ్లో॥ **గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః । గురుర్దేవో మహేశ్వరః ॥**
**గురుసాక్షాత్ పరబ్రహ్మ । తస్మై శ్రీ గురవే నమః ॥**

## ఆచమనమ్

(రాగి గ్లాసులోని నీటిని ఉద్ధరిణెతో ఎడమచేతితో తీసుకొని కుడి అరచేతిలో పోసుకొని) **కేశవాయ స్వాహా, నారాయణాయ స్వాహా, మాధవాయ స్వాహా** (అని మూడుసార్లు పుచ్చుకోవాలి) **గోవిందాయ నమః, మధుసూదనాయ నమః, త్రివిక్రమాయ నమః, వామనాయ నమః, శ్రీధరాయ నమః, హృషీకేశాయ నమః, పద్మనాభాయ నమః, దామోదరాయ నమః, సంకర్షణాయ నమః, వాసుదేవాయ నమః, ప్రద్యుమ్నాయ నమః, అనిరుద్ధాయ నమః, పురుషోత్తమాయ నమః, అధోక్షజాయ నమః, నారసింహాయ నమః, అచ్యుతాయ నమః, జనార్ధనాయ నమః, ఉపేంద్రాయ నమః, హరయే నమః, శ్రీ కృష్ణాయ నమః**

**తాత్పర్యం :**

1. **కేశవాయస్వాహా -** కేశవుని కొరకు సమర్పిస్తున్నాను.
   అని ఉదకము లోపలికి స్వీకరించాలి. తిరిగి పైవిధముగా ఉదకము తీసికొని
2. **నారాయణాయ స్వాహా -** నారాయణుని కొరకు సమర్పిస్తున్నాను.
   అని ఉదకమును లోపలికి తీసుకోవాలి. తిరిగి పైవిధముగా ఉదకమును తీసుకొని

3. **మాధవాయ స్వాహా** - మాధవునిని కొరకు సమర్పిస్తున్నాను.
అని ఉదకమును లోపలికి స్వీకరించాలి.

4. **గోవిందాయ నమః** - (గోవిందునకు నమస్కారము)
5. **విష్ణవే నమః** - (విష్ణువునకు నమస్కారము)
6. **మధుసూదనాయ నమః** - (మధుసూదనునకు నమస్కారము)
7. **త్రివిక్రమాయ నమః** - (త్రివిక్రమునకు నమస్కారము)
8. **వామనాయ నమః** - (వామనునకు నమస్కారము)
9. **శ్రీధరాయ నమః** - (శ్రీధరునకు నమస్కారము)
10. **హృషీకేశాయ నమః** - (హృషీకేశునకు నమస్కారము)
11. **పద్మనాభాయ నమః** - (పద్మనాభునకు నమస్కారము)
12. **దామోదరాయ నమః** - (దామోదరునకు నమస్కారము)
13. **సంకర్షణాయ నమః** - (సంకర్షణునకు నమస్కారము)
14. **వాసుదేవాయ నమః** - (వాసుదేవునకు నమస్కారము)
15. **ప్రద్యుమ్నాయ నమః** - (ప్రద్యుమ్నునకు నమస్కారము)
16. **అనిరుద్ధాయ నమః** - (అనిరుద్ధునకు నమస్కారము)
17. **పురుషోత్తమాయ నమః** - (పురుషోత్తమునకు నమస్కారము)
18. **అధోక్షజాయ నమః** - (అధోక్షజునకు నమస్కారము)
19. **నారసింహాయ నమః** - (నారసింహునకు నమస్కారము)
20. **అచ్యుతాయ నమః** - (అచ్యుతునకు నమస్కారము)
21. **జనార్ధనాయ నమః** - (జనార్ధనునకు నమస్కారము)
22. **ఉపేంద్రాయ నమః** - (ఉపేంద్రునకు నమస్కారము)
23. **హరయే నమః** - (హరికి నమస్కారము)
24. **శ్రీకృష్ణాయ నమః** - (శ్రీకృష్ణునకు నమస్కారము)

ఈ విధంగా ఆచమనము చేయాలి. తరువాత...

ప్రాణానాయమ్య :-

ఓం భూః। ఓం భువః। ఓ(గ్)ం సువః।

ఓం మహః। ఓం జనః। ఓం తపః। ఓ(గ్)ం సత్యం।

ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ।

ధియో యో నః ప్రచోదయాత్ ॥ ఓమాపో జ్యోతీరసో ఽ మృతం

బ్రహ్మ భూర్భువస్సువరోమ్॥ అని (గాలి గట్టిగా పీల్చి వేళ్ళ చివరలతో ముక్కు చివరలను మూసి తిరిగి గాలిని విడవాలి. ఈ విధంగా మూడుసార్లు చేయాలి.)

## ఘంటానాదమ్

శ్లో॥ ఆగమార్థం తు దేవానాం గమనార్థం తు రక్షసామ్ ।

కురు ఘంటారావం తత్ర దేవతాఽ ఽ హ్వాన లాంఛనమ్ ॥

పూజచేసే స్థలానికి దేవతలు రావటానికి ఆహ్వాన పూర్వకంగా ఘంటానాదం చేయాలి.

## భూతోచ్చాటనమ్

శ్లో॥ అపసర్పంతు యే భూతా యే భూతా భూమి సంస్థితాః ।

యే భూతా విఘ్నకర్తార స్తే గచ్ఛంతు శివాజ్ఞయా ॥

శ్లో॥ ఉత్తిష్ఠంతు భూపిశాచాః య ఏతే భూమిభారకాః।

ఏతేషా మవిరోధేన బ్రహ్మకర్మ సమారభే॥

(పూజచేసే స్థలంలో వుండే అసురశక్తులు తొలగిపోవటానికి, అక్కడ వున్న భూతములను వెడలగొట్టుచున్నట్లుగా భావిస్తూ పై శ్లోకాన్ని పఠించాలి)

## దీపారాధనమ్

శ్లో॥ భో దీప! బ్రహ్మరూపేణ సర్వేషాం హృది సంస్థితః।

అతస్త్వాం స్థాపయామ్యద్య మదజ్ఞాన మపాకురు॥

(దీపం కుందిలో ఆవునెయ్యి గాని, నువ్వులనూనె గాని వేసి మూడు ఒత్తులతో దీపాన్ని దైవసన్నిధిలో ముందుగా వెలిగించి, నమస్కరించాలి.

## సంకల్పం

మమ ఉపాత్త సమస్త దురితక్షయ ద్వారా **శ్రీ మహాగణపతి** దేవతా ప్రీత్యర్థం (శుభే శోభనే ముహూర్తే) శ్రీమాన్ **.....**గోత్రః**.....**శర్మాభిధేయోఽహం శ్రీమతః**......** గోత్రస్య**.....** శర్మాభిధేయస్య-మమ ధర్మపత్నీ సమేతస్య మమ ఉపాత్త దురితక్షయద్వారా, అస్మాకం సకుటుంబానాం శ్రుతిస్మృతి పురాణోక్త ఫలప్రాప్త్యర్థం, క్షేమ స్థైర్య ధైర్య వీర్య విజయ అభయ ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృద్ధ్యర్థం, ధర్మార్థకామమోక్ష చతుర్విధ ఫలపురుషార్థ సిద్ధ్యర్థం, మనోవాంఛా ఫలసిద్ధ్యర్థ్యం, సమస్తాభ్యుదయార్థం చ **శ్రీ మహాగణపతి** దేవతా ముద్దిశ్య **శ్రీ మహాగణపతి**, దేవతా ప్రీత్యర్థం। సంభవద్భిర్ ద్రవైః సంభవద్భిదుపచారైః సంభవితా నియమేన భక్తిపూర్వక యావచ్ఛక్తి ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కరిష్యే॥ అని అక్షతలను నీటిని చేతిలో తీసుకొని పళ్లెంలో వదలాలి. తరువాత కలశ పూజ చేయాలి.

## కలశారాధన

**తతః కలశారాధనం కరిష్యే॥ కలశం గంధపుష్పాక్షతైరభ్యర్చ్య ॥**

(అని కలశమును పుష్పాక్షతలతో పూజించి దిగువన గల శ్లోక, మంత్రములతో అభిమంత్రించాలి)

శ్లో॥ **కలశస్య ముఖే విష్ణుః కంఠే రుద్రః సమాశ్రితనమః ।**
**మూలే తత్ర స్థితో బ్రహ్మా మధ్యే మాతృగణాః స్మృతాః ॥**
**కుక్షౌతు సాగరా స్సర్వే సప్తద్వీపా వసుంధరా ।**
**ఋగ్వేదోఽథ యజుర్వేదః సామవేదోహ్యథర్వణః ॥**
**అంగైశ్చ సహితాస్సర్వే కలశాంబు సమాశ్రితాః ।**
**అత్ర గాయత్రీ సావిత్రీ శాంతిః పుష్టికరీ తథా ॥**
**ఆయాంతు దేవపూజార్థం దురితక్షయ కారికాః ।**
**కలశే దశకళాత్మనే వహ్ని మండలమావాహయామి ॥**
**మధ్యే ద్వాదశకళాత్మనే సూర్య మండలమావాహయామి ।**
**ఆధారే షోడశకళాత్మనే చంద్రమండలమావాహయామి ॥**

శ్లో॥ **గంగే! చ యమునే! కృష్ణే! గోదావరి! సరస్వతి!**
**నర్మదే! సింధుకావేర్యా! జలే౽ స్మిన్ సన్నిధిం కురు॥**

**ప్రణవేన దశవారాన్ అభిమంత్ర్య॥ గాయత్రీం త్రివారం జపేత్** – అనగా ప్రణవము (ఓంకారము)తో పదిసార్లు అభిమంత్రించి గాయత్రిని మూడుసార్లు జపించాలి.)

**ఓమ్, ఓమ్, ఓమ్, ఓమ్, ఓమ్, ఓమ్, ఓమ్, ఓమ్, ఓమ్, ఓమ్ (10)**

**ఓం భూర్భువస్సువః । ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ।**
**ధియో యో నః ప్రచోదయాత్ ॥** (ఏవం త్రిః) ఇలా మూడుసార్లు పఠించాలి.
**కలశోదకేన పూజాద్రవ్యాణి సంప్రోక్ష్య । దేవం, ఆత్మానం చ సంప్రోక్ష్య॥**

ఈ విధంగా పై మంత్రాలని పఠించి కళశంలోని నీటిని పువ్వుతో దేవుని మీద, తన మీద, పూజా ద్రవ్యాలన్నింటిమీద కొద్దిగా చల్లుకోవాలి.

॥ఇతి కలశపూజా॥

## శ్రీ మహాగణాధిపతి పూజ

శ్రీ గురుభ్యో నమః ॥ హరిః ఓమ్–అయం ముహూర్తస్సుముహూర్తో౽స్తు॥ సుముహూర్తకాలే సూర్యాదీనాం నవానాం గ్రహాణా మానుకూల్య ఫలసిద్ధిరస్తు॥

శ్లో॥ యశ్శివో నామరూపాభ్యాం యా దేవీ సర్వమంగళా ।
తయోఃసంస్మరణాత్ పుంసాం సర్వతో జయ మంగళమ్ ॥ 1

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥ 2

శ్లో॥ తదేవలగ్నం సుదినం తదేవ తారాబలం చంద్రబలం తదేవ ।
విద్యాబలం దైవబలం తదేవ లక్ష్మీపతే తే౽ంఘ్రియుగం స్మరామి ॥ 3

శ్లో॥ యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।
తత్ర శ్రీ ర్విజయో భూతిర్ ధ్రువానీతిర్మతిర్మమ ॥ 4

శ్లో॥ స్మృతే సకలకల్యాణ భాజనం యత్ర జాయతే ।
పురుషస్తమజం నిత్యం వ్రజామి శరణం హరిమ్ ॥ 5

శ్లో॥ సర్వదా సర్వకార్యేషు నాస్తి తేశామమంగళమ్ ।
యేషాం హృదిస్థో భగవాన్ మంగళాయతనం హరిః ॥ 6

శ్లో॥ లాభస్తేషాం జయస్తేషాం కుతస్తేషాం పరాభవః ।
యేషాం ఇందీవరశ్యామో హృదయస్థో జనార్దనః ॥ 7

శ్లో॥ ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్ ॥ 8

శ్లో॥ సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థ సాధికే ।
శరణ్యే త్ర్యంబకే దేవీ నారాయణి నమోఽస్తు తే ॥ 9

శ్లో॥ అభీప్సితార్థ సిద్ధ్యర్థం పూజితో యస్సురైరపి ।
సర్వవిఘ్న హరస్తస్మై శ్రీగణాధిపతయే నమః ॥ 10

**శ్రీలక్ష్మీనారాయణాభ్యాం నమః । ఉమామహేశ్వరాభ్యాం నమః । వాణీహిరణ్యగర్భాభ్యాం నమః । శచీపురందరాభ్యాం నమః । అరుంధతీవసిష్ఠాభ్యాం నమః । శ్రీసీతారామాభ్యాం నమః । శ్రీరాధాకృష్ణాభ్యాం నమః । సమస్త సద్గురుదేవతాయై నమః । సర్వేభ్యో మహాజనేభ్యో (బ్రాహ్మణేభ్యో)నమః । అవిఘ్నమస్తు ॥ ఆచమ్య ॥ అని ఆచమనం చేయాలి. తరువాత...**

**శ్రీ మహాగణపతి** చిత్రపటం ముందు ఒక తమలపాకుపై పసుపుతో ముద్దచేసి దానికి కుంకుమ బొట్టుపెట్టి విఘ్నేశ్వరుడుగా భావించి (ఇక్కడ వినాయకుడి చిత్రపటాన్నైనా పూజించవచ్చు) ఈ క్రింద తెలిపిన విధంగా అక్షతలతో, పూలతో పూజించాలి.

శ్రీ గణాధిపతయే నమః ధ్యాయామి ధ్యానమ్ సమర్పయామి
శ్రీ గణాధిపతయే నమః ఆవాహయామి ఆవాహనం సమర్పయామి
శ్రీ గణాధిపతయే నమః రత్నసింహాసనం సమర్పయామి
శ్రీ గణాధిపతయే నమః పాదయోః పాద్యం సమర్పయామి
శ్రీ గణాధిపతయే నమః హస్తయోః అర్ఘ్యం సమర్పయామి
శ్రీ గణాధిపతయే నమః ఆచమనం సమర్పయామి
శ్రీ గణాధిపతయే నమః పంచామృత స్నానం సమర్పయామి

శ్రీ గణాధిపతయే నమః శుద్ధోదక స్నానం సమర్పయామి

శ్రీ గణాధిపతయే నమః నూతన వస్త్రం సమర్పయామి

శ్రీ గణాధిపతయే నమః యజ్ఞోపవీతం సమర్పయామి

శ్రీ గణాధిపతయే నమః గంధం సమర్పయామి

శ్రీ గణాధిపతయే నమః పుష్పైః పూజయామి

## నామపూజా

**(గణపతికి ఉన్న క్రింది 16 పేర్లను స్మరించాలి)**

ఓం సుముఖాయ నమః, ఓం ఏకదంతాయ నమః, ఓం కపిలాయ నమః

ఓం గజకర్ణకాయ నమః, ఓం లంబోదరాయ నమః, ఓం వికటాయ నమః

ఓం విఘ్నరాజాయ నమః, ఓం గణాధిపాయ నమః, ఓం ధూమకేతవే నమః

ఓం గణాధ్యక్షాయ నమః, ఓం ఫాలచంద్రాయ నమః, ఓం గజాననాయ నమః

ఓం వక్రతుండాయ నమః, ఓం శూర్పకర్ణాయ నమః, ఓం హేరంబాయ నమః

ఓం స్కందపూర్వజాయ నమః

**ఓం సరసిద్ధి ప్రదాయకాయ నమః ఓం మహాగణపతయే నమః**

**షోడశనామభిః పూజయామి.**

**పైవిధంగా చెబుతూ ఈ క్రింది ఉపచారాలు సమర్పించాలి.**

శ్రీ మహాగణాధిపతయే నమః ధూపం సమర్పయామి (అగరబత్తి వెలిగించాలి)

శ్రీ మహాగణాధిపతయే నమః దీపం సమర్పయామి (దీపం చూపించాలి)

శ్రీ మహాగణాధిపతయే నమః నైవేద్యం సమర్పయామి (అరటిపండ్లు నివేదించాలి)

శ్రీ మహాగణాధిపతయే నమః తాంబూలం సమర్పయామి (తాంబూలం సమర్పించాలి)

శ్రీ మహాగణాధిపతయే నమః నీరాజనం సమర్పయామి (కర్పూర నీరాజనం)

శ్రీ మహాగణాధిపతయే నమః మంత్రపుష్పం సమర్పయామి.

శ్రీ మహాగణాధిపతయే నమః ఆత్మ ప్రదక్షిణ నమస్కారం సమర్పయామి.

శ్రీ మహాగణాధిపతయే నమః ప్రార్థన నమస్కారం సమర్పయామి.

**పై విధంగా చెబుతూ అక్షతలతో గణపతి పూజ చేయాలి.**

# శ్రీ సుబ్రహ్మణ్యస్వామి ధ్యానమ్

శ్లో॥ గాంగేయం వహ్నిగర్భం శరవణజనితం జ్ఞానశక్తింకుమారం ।
బ్రహ్మణ్యం స్కందదేవం గుహమమలమిదం రుద్రతేజ స్స్వరూపం ।
సేనాన్యం తారకఘ్నం గురుమచలమిదం కార్తికేయం షడాస్యం ।
సుబ్రహ్మణ్యం మయూర ధ్వజరథసహితం దేవదేవం నమామి ॥

శ్రీ సుబ్రహ్మణ్యస్వామి దేవతాభ్యో నమః- ధ్యాయామి ధ్యానం సమర్పయామి ॥

*(శ్రీ సుబ్రహ్మణ్యస్వామిని భక్తిగా ధ్యానం చేయాలి.)*

## 1. ఆవాహనమ్

సహస్రశీర్షేత్యావాహనమ్ :-

మంత్రం : *ఓం సహస్రశీర్షా పురుషః । సహస్రాక్షస్సహస్రపాత్।*
*స భూమిం విశ్వతో వృత్వా । అత్యతిష్ఠద్దశాంగులమ్ ॥*

శ్లో॥ ఆగచ్ఛ దేవదేవేశ! తేజోరాశే! జగత్పతే! ।
క్రియామాణాం మయా పూజాం గృహాణ సురసత్తమ ॥

**శ్రీ సుబ్రహ్మణ్యస్వామి** దేవతాభ్యో నమః – ఆవాహనార్థే పుష్పాంజలిం సమర్పయామి॥

*(శ్రీ సుబ్రహ్మణ్యస్వామిని భక్తిగా ఆవాహన చేయాలి.)*

## 2. ఆసనమ్

పురుష ఏవేదమిత్యాసనమ్ :-

మంత్రం : *ఓం పురుష ఏవేదగ్ం సర్వమ్ । యద్భూతం యచ్చ భవ్యమ్ ।*
*ఉతామృతత్వ స్యేశానః । యదన్నేనాతిరోహతి ॥*

శ్లో॥ నానారత్నసమాయుక్తం కార్తస్వర విభూషితమ్ ।
ఆసనం దేవదేవేశ! ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్ ॥

**శ్రీ సుబ్రహ్మణ్యస్వామి** దేవతాభ్యో నమః॥
నవరత్నఖచిత స్వర్ణసింహాసనం సమర్పయామి॥

*(శ్రీ సుబ్రహ్మణ్యస్వామి ముందు అక్షతలు ఉంచండి.)*

## 3. పాద్యమ్

ఏతావాన స్యేతి పాద్యమ్ :-

మంత్రం : *ఓం ఏతావానస్య మహిమా । అతో జ్యాయాగ్శ్చ పూరుషః ।*
*పాదోఽ స్య విశ్వా భూతాని । త్రిపాదస్యామృతం దివి ॥*

శ్లో॥ **పాద్యం గృహాణ దేవేశ సర్వక్షేమ సమర్థ భో! ।**
**భక్త్యా సమర్పితం దేవ! లోకనాథ! నమోఽ స్తుతే ॥**

శ్రీ సుబ్రహ్మణ్యస్వామి దేవతాభ్యో నమః। పాదయోః పాద్యం సమర్పయామి ॥
*(కొద్దిగా నీటిని ఉద్ధరణితో తీసుకొని స్వామి పాదాలకు చూపించి అరివేణంలో పోయండి)*

## 4. అర్ఘ్యమ్

త్రిపాదూర్ధ్వ ఇత్యర్ఘ్యమ్ :-

మంత్రం : *ఓం త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః। పాదో ఽ స్యేహాభవాత్పునః।*
*తతో విష్వజ్వ్యక్రామత్ । సాశనానశనే అభి ॥*

శ్లో॥ **నమస్తే దేవదేవేశ! నమస్తే ధరణీధర! ।**
**నమస్తే జగదాధార ! అర్ఘ్యం నః ప్రతిగృహ్యతామ్ ॥**

శ్రీ సుబ్రహ్మణ్యస్వామి దేవతాభ్యో నమః -హస్తయోః అర్ఘ్యం సమర్పయామి ॥
*(కొద్దిగా నీటిని ఉద్ధరణితో తీసుకొని స్వామివారి చేతులకు చూపించి అరివేణంలో పోయండి..)*

## 5. ఆచమనమ్

తస్మాద్విరాడిత్యాచమనమ్ :-

మంత్రం : *ఓం తస్మాద్విరాడజాయత । విరాజో అధిపూరుషః ।*
*స జాతో అత్యరిచ్యత । పశ్చాద్భూమి మథో పురః ॥*

శ్లో॥ **కర్పూరవాసితం తోయం మందాకిన్యాః సమాహృతమ్।**
**ఆచమ్యతాం జగన్నాథ! మయాదత్తం హి భక్తితః॥**

శ్రీ **సుబ్రహ్మణ్యస్వామి** దేవతాభ్యో నమః-ముఖే ఆచమనీయం సమర్పయామి॥

*(కొద్దిగా నీటిని ఉద్ధరణితో తీసుకొని స్వామివారి ముఖానికి చూపించి అరివేణంలో పోయండి.)*

## 6. మధుపర్కమ్

శ్లో॥ **మధ్వాజ్యదధిసంయుక్తం స్వర్ణపాత్రే ప్రతిష్ఠితమ్ ।**
**మధుపర్కం గృహాణ త్వం దేవదేవ! నమోఽస్తు తే॥**

శ్రీ **సుబ్రహ్మణ్యస్వామి** దేవతాభ్యో నమః-మధుపర్కం సమర్పయామి ॥

*(తేనె, నెయ్యి, పెరుగు కలిపిన పదార్థాన్ని ఉద్ధరిణతో స్వామివారికి చూపించి తీర్థపాత్రలో పోయండి.)*

## 7. స్నానమ్

**యత్పురుషేణేతి స్నానమ్ :-**

**మంత్రం :** *ఓం యత్పురుషేణ హవిషా । దేవా యజ్ఞమతన్వత ।*
*వసంతో అస్యాఽసీదాజ్యమ్ । గ్రీష్మ ఇధ్మశ్శరద్ధవిః॥*

శ్లో॥ **తీర్థోదకైః కాంచనకుంభసంస్థైః సువాసితై ర్దేవ కృపారసార్ద్రైః ।**
**మయాఽర్పితం స్నానవిధిం గృహాణ పాదాబ్జ నిష్ఠ్యూత నదీ ప్రవాహ॥**

శ్రీ **సుబ్రహ్మణ్యస్వామి** దేవతాభ్యో నమః-(మలాపకర్షణ)స్నానం సమర్పయామి॥

## పంచామృత స్నానమ్

శ్లో॥ **పయో దధి ఘృతం చైవ మధు చ శర్కరాఽన్వితమ్ ।**
**పంచామృతం మయాఽఽనీతం స్నానార్థం ప్రతిగృహ్యతామ్ ॥**

శ్రీ **సుబ్రహ్మణ్యస్వామి** దేవతాభ్యో నమః - (మలాపకర్షణ)స్నానం సమర్పయామి॥

1. **॥ పయః స్నానమ్ ॥ (పాలతో అభిషేకించాలి.)**

శ్లో॥ **కామధేనోః సముద్భూతం దేవర్షి పితృతృప్తిదమ్ ।**
**పయోదదామి దేవేశ! స్నానార్థం ప్రతిగృహ్యతామ్ ॥**

శ్రీ **సుబ్రహ్మణ్యస్వామి** దేవతాభ్యో నమః-స్నానార్థే పయఃస్నానం సమర్పయామి॥
పయఃస్నానానంతరం ఆపోహిష్ఠేతి శుద్ధోదకస్నానం సమర్పయామి॥

2. ॥దధిస్నానమ్॥ (పెరుగుతో అభిషేకించాలి)

శ్లో॥ చంద్రమండల సంకాశం సర్వదేవ ప్రియం దధి ।
స్నానార్థం తే మయాదత్తం ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్ ॥
శ్రీ సుబ్రహ్మణ్యస్వామి దేవతాభ్యో నమః - దధిస్నానం సమర్పయామి ॥
దధిస్నానానంతరం శుద్ధోదక స్నానం సమర్పయామి॥

3. ॥ఆజ్యస్నానమ్॥ (నేతితో అభిషేకించాలి)

శ్లో॥ ఆజ్యం సురాణామాహార ఆజ్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ ।
ఆజ్యం పవిత్రం పరమం స్నానా ఽ ర్థం ప్రతిగృహ్యతామ్ ॥
శ్రీ సుబ్రహ్మణ్యస్వామి దేవతాభ్యో నమః-ఆజ్యస్నానం సమర్పయామి ॥

4. ॥మధుస్నానమ్ ॥ (తేనెతో అభిషేకించాలి)

శ్లో॥ సర్వౌషధి సముత్పన్నం పీయూష సదృశం మధు ।
స్నానా ఽ ర్థం తే ప్రయచ్ఛామి గృహాణ పరమేశ్వర॥
శ్రీ సుబ్రహ్మణ్యస్వామి దేవతాభ్యో నమః - మధుస్నానం సమర్పయామి ॥
ఆజ్య, మధుస్నానాంతరం శుద్ధోదక స్నానం సమర్పయామి ॥

5. ॥ శర్కరా స్నానమ్ ॥ (చక్కెరతో అభిషేకించాలి)

శ్లో॥ ఇక్షుదండ సముద్భూత దివ్యశర్కరయా హరిమ్ ।
స్నాపయామి సదా భక్త్యా ప్రీతో భవ సురేశ్వర ॥
శ్రీ సుబ్రహ్మణ్యస్వామి దేవతాభ్యో నమః - శర్కరా స్నానం సమర్పయామి ॥
శర్కరా స్నానానంతరం శుద్ధోదక స్నానం సమర్పయామి ॥

॥ఫలోదక స్నానమ్॥ (కొబ్బరినీళ్ళతో అభిషేకించాలి)

శ్రీ సుబ్రహ్మణ్యస్వామి దేవతాభ్యోనమః-నారికేళ ఫలోదకస్నానం సమర్పయామి॥
నారికేళ ఫలోదక స్నానానంతరం శుద్ధోదకస్నానం సమర్పయామి॥

॥శుద్ధోదక స్నానమ్ ॥(మంచినీటితో అభిషేకించాలి)

శ్లో॥ శుద్ధం యత్ సలిలం దివ్యం గంగాజలసమం స్మృతమ్ ।
సమర్పితం మయాభక్త్యా శుద్ధస్నానాయ గృహ్యతామ్ ॥

**శ్రీ సుబ్రహ్మణ్యస్వామి** దేవతాభ్యో నమః-మహాభిషేక స్నానం సమర్పయామి ॥
స్నానాంతే ఆచమనీయం సమర్పయామి॥

*(పై తెలిపిన విధంగా పంచామృతాలతో అభిషేక ద్రవాన్ని సిద్ధంచేసుకొని ఉద్ధరిణతో స్వామివారికి చూపించి స్నానము చేయిస్తున్నట్టుగా భావించి ఆ పంచామృతాలను తీర్థపాత్రలో వేయండి)*

## 7. వస్త్రమ్

**సప్తాస్యాసన్నితి వస్త్రమ్ :-**

**మంత్రం :** *ఓం సప్తాస్యాసన్పరిధయః । త్రిస్సప్తసమిధః కృతాః*
*దేవా యద్యజ్ఞం తన్వానాః । అబధ్నన్పురుషం పశుమ్ ॥*

శ్లో॥ **సర్వభూషాఽధికే సౌమ్యే లోకలజ్జా నివారణే ।**
**మయోపపాదితే తుభ్యం వాససీ ప్రతిగృహ్యతామ్ ॥**

**శ్రీ సుబ్రహ్మణ్యస్వామి** దేవతాభ్యోనమః - వస్త్రయుగ్మం సమర్పయామి ॥
వస్త్రాంతే ఆచమనీయం సమర్పయామి॥

*(స్వామివారికి నూతన వస్త్రాలనుగాని, అక్షతలనుగాని సమర్పించాలి)*

## 8. యజ్ఞోపవీతమ్

**తం యజ్ఞమితి యజ్ఞోపవీతమ్ :**

**మంత్రం :** *ఓం తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్న్ । పురుషం జాత మగ్రతః ।*
*తేన దేవా అయజంత । సాధ్యా ఋషయశ్చ యే ॥*

శ్లో॥ **దేవదేవ! నమస్తేఽస్తు త్రాహిమాం భవసాగరాత్ ।**
**బ్రహ్మసూత్రం సోత్తరీయం గృహాణ పురుషోత్తమ ॥**

**శ్రీ సుబ్రహ్మణ్యస్వామి** దేవతాభ్యోనమః - యజ్ఞోపవీతం సమర్పయామి ॥
యజ్ఞోపవీతాంతే ఆచమనీయం సమర్పయామి ॥

*(స్వామివారికి యజ్ఞోపవీతాన్నిగాని, అక్షతలనుగాని సమర్పించాలి)*

**గమనిక :**

1. స్నానేఽ ధూపే చ దీపేచ ఘంటార్నాదమాచరేత్ ॥
   (స్నాన, ధూప, దీప సమయములందు ఘంటానాదం చేయాలి.)

## 9. ఆభరణమ్

**తస్మాద్యజ్ఞాదితి ఆభరణమ్ :-**

**మంత్రం :** *ఓం తస్మాద్యజ్ఞాత్సర్వహుతః । సంభృతం పృషదాజ్యమ్ ।*
*పశూగ్‌స్తాగ్‌స్చక్రే వాయవ్యాన్ । ఆరణ్యాన్గ్రామ్యాశ్చ యే ॥*

శ్లో॥ **అలంకారాన్ మయాదేవ సువర్ణేన వినిర్మితాన్ ।**
**ప్రీత్యర్థం తవ దేవేశ భూషణం ప్రతిగృహ్యతామ్ ॥**

శ్లో॥ **కేయూరకటకే చైవ హస్తే చిత్రాంగులీయకమ్ ।**
**మాణిక్యోల్లాసి మకుటం కుండలే హార శోభితమ్ ॥**

శ్రీ **సుబ్రహ్మణ్యస్వామి** దేవతాభ్యోనమః-నానావిధ ఆభరణాని సమర్పయామి॥
*(స్వామివారికి ఆభరణాలనుగాని, అక్షతలనుగాని సమర్పించాలి)*

## 10. గంధమ్

**తస్మాద్యజ్ఞాదితి గంధమ్ :-**

**మంత్రం :** *ఓం తస్మాద్యజ్ఞాత్సర్వహుతః । ఋచస్సామాని జజ్ఞిరే ।*
*ఛందాగ్ంసి జజ్ఞిరే తస్మాత్। యజుస్తస్మాదజాయత ॥*

శ్లో॥ **శ్రీఖండం చందనం దివ్యం గంధాఽఢ్యం**
**విలేపనం సురశ్రేష్ఠ చందనం ప్రతిగృహ్యతామ్ ॥**

శ్రీ **సుబ్రహ్మణ్యస్వామి** దేవతాభ్యోనమః- శ్రీ గంధం సమర్పయామి ॥
*(స్వామివారికి శ్రీగంధాన్ని సమర్పించాలి)*

### అక్షతాన్

శ్లో॥ **అక్షతాస్తందులాః శుభ్రాః కుంకుమేన విరాజితాః ।**
**మయా నివేదితా భక్త్యా గృహాణ పరమేశ్వర ॥**

**శ్రీ సుబ్రహ్మణ్యస్వామి** దేవతాభ్యోనమః-అలంకరణార్థే అక్షతాన్ సమర్పయామి

*(స్వామివారికి అక్షతలను సమర్పించాలి)*

## పరిమళ ద్రవ్యమ్

శ్లో॥ **దివ్యగంధ సమాయుక్తం నానాపరిమళాఽన్వితమ్ ।**
**గంధద్రవ్యమిదం భక్త్యా దత్తం స్వీకురుశోభనమ్ ॥**

**శ్రీ సుబ్రహ్మణ్యస్వామి** దేవతాభ్యోనమః-సుగంధ పరిమళద్రవ్యాణి సమర్పయామి॥

*(స్వామివారికి సుగంధ ద్రవ్యాన్ని (సెంటు) సమర్పించాలి.)*

## 11. పుష్పమ్

**తస్మాదశ్వా ఇతి పుష్పమ్ :-**

**మంత్రం :** *ఓం తస్మాదశ్వా అజాయంత । యే కే చోభయాదతః ।*
*గావో హ జజ్ఞిరే తస్మాత్ । తస్మాజ్జాతా అజావయః॥*

శ్లో॥ **చామంతికా వకుళ చంపక పాటలాబ్జ**
**పున్నాగ జాజి కరవీర రసాలపుష్పైః ।**
**బిల్వ ప్రవాళ తులసీదళ మల్లికాభిః**
**త్వాం పూజయామి జగదీశ్వర । మే ప్రసీద ॥**

**శ్రీ సుబ్రహ్మణ్యస్వామి** దేవతాభ్యోనమః
నానావిధ విచిత్ర పరిమళ పత్రపుష్పాణి సమర్పయామి॥

*(అష్టోత్తర శతనామావళితో పుష్పార్చన చేయాలి)*



# శ్రీ వల్లీ దేవసేనా సమేత
# శ్రీ సుబ్రహ్మణ్యస్వామినే నమః పుష్పైః పూజయామి

*(ఇక్కడ శ్రీ సుబ్రహ్మణ్యస్వామి అంగపూజా, అష్టోత్తర శతనామపూజా, ఆ తరువాత శ్రీ వల్ల్యష్టోత్తర శతనామపూజా, శ్రీ దేవసేనాష్టోత్తర శతనామపూజలను పూలు లేదా అక్షతలతో చేయాలి)*

## అథాంగపూజ

| | |
|---|---|
| ఓం సురవందితపాదాయ నమః | పాదౌ పూజయామి |
| ఓం ముకురాకారజానవే నమః | జానునీ పూజయామి |
| ఓం కరిరాజకరోరవే నమః | ఊరూ పూజయామి |
| ఓం రత్నకింకిణికా నూపురకట్యై నమః | కటిం పూజయామి |
| ఓం గుహాయ నమః | గుహ్యం పూజయామి |
| ఓం హేరంబసహోదరాయ నమః | ఉదరం పూజయామి |
| ఓం సునాభయే నమః | నాభిం పూజయామి |
| ఓం సుహృదే నమః | హృదయం పూజయామి |
| ఓం విశాలవక్షసే నమః | వక్షస్థలం పూజయామి |
| ఓం కృత్తికాస్తనంధయాయ నమః | స్తనౌ పూజయామి |
| ఓం శత్రుజయోర్జితబాహవే నమః | బాహూన్ పూజయామి |
| ఓం శక్తిహస్తాయ నమః | హస్తాన్ పూజయామి |
| ఓం పుష్కరస్రగ్వ్విశోభికంఠాయ నమః | కంఠం పూజయామి |
| ఓం షణ్ముఖాయ నమః | ముఖాని పూజయామి |
| ఓం సురసేనాధీశాయ నమః | నాసికాం పూజయామి |
| ఓం ద్విషణ్ణేత్రాయ నమః | నేత్రాణి పూజయామి |
| ఓం హిరణ్యకుండలకర్ణాయ నమః | కర్ణాని పూజయామి |
| ఓం ఫాలనేత్రసుతాయ నమః | ఫాలం పూజయామి |
| ఓం వేదశిరోవేద్యాయ నమః | శిరః పూజయామి |
| ఓం సర్వజగద్రక్షకాయ నమః | సర్వాణ్యంగాని పూజయామి |

**శ్రీ వల్లీ దేవసేనా సమేత శ్రీ సుబ్రహ్మణ్యస్వామినే నమః సర్వాణి అంగాని పూజయామి**

## శ్రీ సుబ్రహ్మణ్య అష్టోత్తర శతనామావళి

ఓం స్కంధాయ నమః
ఓం గుహాయ నమః
ఓం షణ్ముఖాయ నమః
ఓం ఫాలనేత్రసుతాయ నమః
ఓం ప్రభవే నమః
ఓం పింగళాయ నమః
ఓం కృత్తికాసూనవే నమః
ఓం శిఖివాహాయ నమః
ఓం ద్విషడ్భుజాయ నమః
ఓం ద్విషణ్ణేత్రాయ నమః 10
ఓం శక్తిధారాయ నమః
ఓం పిశితాశప్రభంజనాయ నమః
ఓం తారకాసురసంహార్త్రే నమః
ఓం రక్షోబలవిమర్దనాయ నమః
ఓం మత్తాయ నమః
ఓం ప్రమత్తాయ నమః
ఓం ఉన్మత్తాయ నమః
ఓం సురసైన్యస్సురరక్షకాయ నమః
ఓం దేవాసేనాపతయే నమః
ఓం ప్రాజ్ఞాయ నమః 20
ఓం కృపాళవే నమః
ఓం భక్తవత్సలాయ నమః
ఓం ఉమాసుతాయ నమః
ఓం శక్తిధరాయ నమః
ఓం కుమారాయ నమః
ఓం క్రౌంచదారణాయ నమః
ఓం సేనానియే నమః
ఓం అగ్నిజన్మనే నమః
ఓం విశాఖాయ నమః
ఓం శంకరాత్మజాయ నమః 30
ఓం శివస్వామినే నమః
ఓం గుణస్వామినే నమః
ఓం సర్వస్వామినే నమః
ఓం సనాతనాయ నమః
ఓం అనంతశక్తయే నమః
ఓం అక్షోభ్యాయ నమః
ఓం పార్వతీప్రియనందనాయ నమః
ఓం గంగాసుతాయ నమః
ఓం శరోద్భూతాయ నమః
ఓం ఆహూతాయే నమః 40
ఓం పావకాత్మజాయ నమః
ఓం జృంభాయ నమః
ఓం ప్రజృంభాయ నమః
ఓం ఉజృంభాయ నమః
ఓం కమలాసనసంస్తుతాయ నమః
ఓం ఏకవర్ణాయ నమః
ఓం ద్వివర్ణాయ నమః
ఓం త్రివర్ణాయ నమః
ఓం సుమనోహరాయ నమః
ఓం చతుర్వర్ణాయ నమః 50
ఓం పంచవర్ణాయ నమః
ఓం ప్రజాపతయే నమః
ఓం అహర్పతయే నమః
ఓం అగ్నిగర్భాయ నమః

ఓం శమీగర్భాయ నమః
ఓం విశ్వరేతసే నమః
ఓం సురారిఘ్నే నమః
ఓం హరిద్వర్ణాయ నమః
ఓం శుభకరాయ నమః
ఓం పటవే నమః 60
ఓం వటువేషభృతే నమః
ఓం పూషాయ నమః
ఓం గభస్తియే నమః
ఓం గహనాయ నమః
ఓం చంద్రవర్ణాయ నమః
ఓం కళాధరాయ నమః
ఓం మాయాధరాయ నమః
ఓం మహామాయినే నమః
ఓం కైవల్యాయ నమః
ఓం శంకరాత్మజాయ నమః 70
ఓం విశ్వయోనియే నమః
ఓం అమేయాత్మా నమః
ఓం తేజోనిధయే నమః
ఓం అనామయాయ నమః
ఓం పరమేష్ఠినే నమః
ఓం పరబ్రహ్మయ నమః
ఓం వేదగర్భాయ నమః
ఓం పుళిందకన్యాభర్తాయ నమః
ఓం మహాసార్వతావృతాయ నమః 80
ఓం ఆశ్రితాఖిలదాత్రే నమః
ఓం చోరఘ్నాయ నమః
ఓం రోగనాశనాయ నమః
ఓం అనంతమూర్తయే నమః
ఓం ఆనందాయ నమః
ఓం శిఖిండికృతకేతనాయ నమః
ఓం డంభాయ నమః
ఓం పరమడంభాయ నమః
ఓం మహాడంభాయ నమః
ఓం వృషాకపయే నమః 90
ఓం కారణోపాత్తదేహాయ నమః
ఓం కారణాతీతవిగ్రహాయ నమః
ఓం అనీశ్వరాయ నమః
ఓం అమృతాయ నమః
ఓం ప్రాణాయ నమః
ఓం ప్రాణాయామపరాయణాయ నమః
ఓం విరుద్ధహంత్రే నమః
ఓం వీరఘ్నాయ నమః
ఓం రక్తాస్యామగళాయ నమః
ఓం మహతే నమః 100
ఓం శ్యామకంధరాయ నమః
ఓం సుబ్రహ్మణ్యాయ నమః
ఓం గుహాయ నమః
ఓం ప్రీతాయ నమః
ఓం బ్రాహ్మణ్యాయ నమః
ఓం బ్రాహ్మణప్రియాయ నమః
ఓం వంశవృద్ధికరాయ నమః
ఓం వేదవేద్యాయ నమః
ఓం అక్షయఫలదాయ నమః 108

***ఇతి శ్రీ వల్లీ దేవసేనా సమేత శ్రీ సుబ్రహ్మణ్యస్వామినే నమః***

***నానావిధ పరిమళపత్ర పుష్పాక్షతాన్ సమర్పయామి***

## శ్రీ వల్లీఅష్టోత్తర శతనామావళి

ఓం మహావల్ల్యై నమః
ఓం శ్యామతనవే నమః
ఓం సర్వాభరణ భూషితాయై నమః
ఓం పీతాంబర్యై నమః
ఓం శశిసుతాయై నమః
ఓం దివ్యాయై నమః
ఓం అంబుజధారిణ్యై నమః
ఓం పురుషాకృతయే నమః
ఓం బ్రాహ్మ్యై నమః
ఓం నళిన్యై నమః 10
ఓం జ్వాలానేత్రికాయై నమః
ఓం లంబాయై నమః
ఓం ప్రలంబాయై నమః
ఓం తాటంకిన్యై నమః
ఓం నగేంద్రతనయాయై నమః
ఓం శుభరూపాయై నమః
ఓం శుభంకరాయై నమః
ఓం వ్యాలంబకరాయై నమః
ఓం ప్రత్యూషాయై నమః
ఓం మహేశ్వర్యై నమః 20
ఓం తుంగస్తన్యై నమః
ఓం సకంచుకాయై నమః
ఓం అణిమాయై నమః
ఓం మహాదేవ్యై నమః
ఓం గుంజాయై నమః
ఓం మాల్యధరాయై నమః
ఓం వైష్ణవ్యై నమః
ఓం త్రిభంగ్యై నమః
ఓం ప్రవాళవదనాయై నమః
ఓం మనోన్మన్యై నమః 30
ఓం చాముండాయై నమః
ఓం స్కందభార్యాయై నమః
ఓం సత్ప్రభాయై నమః
ఓం నిర్ణయాయై నమః
ఓం ఓజసే నమః
ఓం తేజసే నమః
ఓం అనామయాయై నమః
ఓం పరమేష్ఠిన్యై నమః
ఓం గురుబ్రాహ్మణ్యై నమః
ఓం చంద్రవర్ణాయై నమః 40
ఓం కళాధరాయై నమః
ఓం పూర్ణచంద్రాయై నమః
ఓం స్వర్గాధ్యక్షాయై నమః
ఓం జయాయై నమః
ఓం సిద్ధ సేవితాయై నమః
ఓం ద్వినేత్రాయై నమః
ఓం ద్విభుజాయై నమః
ఓం ఆర్యాయై నమః
ఓం ఇష్టసిద్ధి ప్రదాయికాయై నమః
ఓం సామ్రాజ్యాయై నమః 50
ఓం స్వధాకారాయై నమః
ఓం కాంచనాయై నమః
ఓం హేమభూషణాయై నమః
ఓం మహావల్ల్యై నమః

ఓం వారాహ్యై నమః
ఓం సద్యోజాతాయై నమః
ఓం పంకజాయై నమః
ఓం సర్వాధ్యక్షాయై నమః
ఓం సురాధ్యక్షాయై నమః
ఓం లోకాధ్యక్షాయై నమః 60
ఓం సుందర్యై నమః
ఓం ఇంద్రాణ్యై నమః
ఓం వరలక్ష్మై నమః
ఓం బ్రాహ్మీవిద్యాయై నమః
ఓం సరస్వత్యై నమః
ఓం కుమార్యై నమః
ఓం భద్రకాళ్యై నమః
ఓం దుర్గాయై నమః
ఓం జనమోహిన్యై నమః
ఓం సురాగ్రజాయై నమః 70
ఓం సుస్వప్నాయై నమః
ఓం సుషుప్తేచ్ఛాయై నమః
ఓం సాక్షిణ్యై నమః
ఓం పురాణ్యై నమః
ఓం పుణ్యరూపిణ్యై నమః
ఓం కైవల్యాయై నమః
ఓం కలాత్మికాయై నమః
ఓం ఇంద్రాణ్యై నమః
ఓం ఇంద్రరూపిణ్యై నమః
ఓం ఇంద్రశక్త్యై నమః 80
ఓం పరాయణాయై నమః
ఓం కావేర్యై నమః
ఓం తుంగభద్రాయై నమః
ఓం క్షీరాబ్ధితనయాయై నమః
ఓం కృష్ణవేణ్యై నమః
ఓం భీమనద్యై నమః
ఓం పుష్కరాయై నమః
ఓం సర్వతోముఖ్యై నమః
ఓం పరాశక్త్యై నమః 90
ఓం సర్వమంగళకారణాయై నమః
ఓం బిందుస్వరూపిణ్యై నమః
ఓం శర్వాణ్యై నమః
ఓం యోగిన్యై నమః
ఓం పాపనాశిన్యై నమః
ఓం ఈశానాయై నమః
ఓం లోకమాత్రే నమః
ఓం పోషిణ్యై నమః
ఓం పద్మవాసిన్యై నమః
ఓం గుణత్రయాయై నమః 100
ఓం దయారూపిణ్యై నమః
ఓం నాయికాయై నమః
ఓం నాగధారిణ్యై నమః
ఓం అశేషహృదయాయై నమః
ఓం దేవ్యై నమః
ఓం శరణాగత రక్షిణ్యై నమః
ఓం సౌమ్యాయై నమః
ఓం శ్రీవల్ల్యై నమః 108

***శ్రీ వల్లీ దేవ్యై నమః నానావిధ పరిమళపత్ర పుష్పాక్షతాన్ సమర్పయామి***
***అష్టోత్తర శతనామపూజాం సమర్పయామి***

# శ్రీ దేవసేనా అష్టోత్తర శతనామావళి

ఓం పీతాంబర్యై నమః
ఓం దేవసేనాయై నమః
ఓం దివ్యాయై నమః
ఓం ఉత్పలధారిణ్యై నమః
ఓం అణిమాయై నమః
ఓం మహాదేవ్యై నమః
ఓం కరాళిన్యై నమః
ఓం జ్వాలానేత్రై నమః
ఓం మహాలక్ష్మై నమః
ఓం వారాహ్యై నమః
ఓం బ్రహ్మవిద్యాయై నమః 10
ఓం సరస్వత్యై నమః
ఓం ఉషాయై నమః
ఓం ప్రకృత్యై నమః
ఓం శివాయై నమః
ఓం సర్వాభరణభూషితాయై నమః
ఓం శుభరూపాయై నమః
ఓం శుభంకర్యై నమః
ఓం ప్రత్యూషాయై నమః
ఓం మహేశ్వర్యై నమః 20
ఓం అచింత్యశక్త్యై నమః
ఓం అక్షోభ్యాయై నమః
ఓం చంద్రవర్ణాయై నమః
ఓం కళాధరాయై నమః
ఓం పూర్ణచంద్రాయై నమః
ఓం సర్వస్యై నమః
ఓం యక్షాయై నమః
ఓం ఇష్టసిద్ధిప్రదాయికాయై నమః
ఓం మయంధరాయై నమః
ఓం మహామాయాయై నమః 30
ఓం ప్రవాళవదనాయై నమః
ఓం అనంతాయై నమః
ఓం ఇంద్రాణ్యై నమః
ఓం ఇంద్రరూపిణ్యై నమః
ఓం ఇంద్రశక్త్యై నమః
ఓం పరాయణాయై నమః
ఓం లోకాధ్యక్షాయై నమః
ఓం సురాధ్యక్షాయై నమః
ఓం ధర్మాధ్యక్షాయై నమః
ఓం సుందర్యై నమః 40
ఓం సుజాగృతాయై నమః
ఓం సుస్వరూపాయై నమః
ఓం స్కందభార్యాయై నమః
ఓం సత్ప్రభాయై నమః
ఓం ఐశ్వర్యాసనాయై నమః
ఓం అనింద్యాయై నమః
ఓం కావేర్యై నమః
ఓం తుంగభద్రాయై నమః
ఓం ఈశానాయై నమః
ఓం లోకమాత్రే నమః 50
ఓం ఓజసే నమః
ఓం తేజసే నమః
ఓం అఘాపహాయై నమః
ఓం సద్యోజాతాయై నమః

ఓం స్వరూపాయై నమః
ఓం భోగిన్యై నమః
ఓం పాపనాశిన్యై నమః
ఓం సుఖాశనాయై నమః
ఓం సుఖాకారాయై నమః
ఓం మహాఛత్రాయై నమః 60
ఓం పురాతన్యై నమః
ఓం వేదాయై నమః
ఓం వేదరసాయై నమః
ఓం వేదగర్భాయై నమః
ఓం త్రయీమయ్యై నమః
ఓం సామ్రాజ్యాయై నమః
ఓం సుధాకారాయై నమః
ఓం కాంచనాయై నమః
ఓం హేమభూషణాయై నమః
ఓం మూలాధిపాయై నమః 70
ఓం పరాశక్త్యై నమః
ఓం పుష్కరాయై నమః
ఓం సర్వతోముఖ్యై నమః
ఓం దేవసేనాయై నమః
ఓం ఉమాయై నమః
ఓం పార్వత్యై నమః
ఓం విశాలాక్ష్యై నమః
ఓం హేమవత్యై నమః
ఓం సనాతనాయై నమః
ఓం బహువర్ణాయై నమః 80
ఓం గోపవత్యై నమః
ఓం సర్వస్వాయై నమః
ఓం మంగళకారిణ్యై నమః
ఓం అంబాయై నమః
ఓం గణాంబాయై నమః
ఓం విశ్వాంబాయై నమః
ఓం సుందర్యై నమః
ఓం త్రిపురసుందర్యై నమః
ఓం మనోన్మన్యై నమః
ఓం చాముండాయై నమః 90
ఓం నాయికాయై నమః
ఓం నాగధారిణ్యై నమః
ఓం స్వధాయై నమః
ఓం విశ్వతోముఖ్యై నమః
ఓం సురాధ్యక్షాయై నమః
ఓం సురేశ్వర్యై నమః
ఓం గుణత్రయాయై నమః
ఓం దయారూపిణ్యై నమః
ఓం అభియాతిగాయై నమః
ఓం ప్రాణశక్త్యై నమః 100
ఓం పరాదేవ్యై నమః
ఓం శరణాగతరక్షణాయై నమః
ఓం అశేషహృదయాయై నమః
ఓం దేవ్యై నమః
ఓం సర్వేశ్వర్యై నమః
ఓం దేవసేనాయై నమః
ఓం సిద్ధిదాయై నమః
ఓం దేవసేనాయై నమః

*శ్రీ దేవసేనా దేవ్యై నమః నానావిధ పరిమళపత్ర పుష్పాక్షతాన్.*
*అష్టోత్తర శతనామపూజాం సమర్పయామి.*

## 12. ధూపమ్

**యత్పురుషమితి ధూపమ్ :-**

**మంత్రం :** *ఓం యత్పురుషం వ్యదధుః కతిధా వ్యకల్పయన్ ।*
*ముఖం కిమస్య కౌ బాహూ । కావూరూ పాదావుచ్యేతే ॥*

శ్లో॥ **వనస్పతి రసోద్భూతో గంధాఽఢ్యో గంధ ఉత్తమః ।**
**ఆఘ్రేయః సర్వదేవానాం ధూపోఽయం ప్రతిగృహ్యతామ్ ॥**
శ్రీ **సుబ్రహ్మణ్యస్వామి** దేవతాభ్యోనమః - ధూపమాఘ్రాపయామి ॥
*(స్వామివారికి అగరబత్తిని వెలిగించి తిప్పాలి)*

## 13. దీపమ్

**బ్రాహ్మణోఽస్యేతి దీపమ్ :-**

**మంత్రం :** *ఓం బ్రాహ్మణోస్య ముఖమాసీత్ । బాహూ రాజన్యః కృతః ।*
*ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాగ్ం శూద్రో అజాయత ॥*

శ్లో॥ **ఆజ్యం సువర్తి సంయుక్తం వహ్నినాయోజితం మయా ।**
**దీపం గృహాణ దేవేశ! త్రైలోక్యతిమిరాపహ ॥**
**త్రాహిమాం నరకాద్ఘోరాద్దీపోయం ప్రతిగృహ్యతామ్॥**
శ్రీ **సుబ్రహ్మణ్యస్వామి** దేవతాభ్యోనమః - దీపం దర్శయామి ॥
*(స్వామివారికి దీపాన్ని చూపించాలి)*

## 14. నైవేద్యమ్

**చంద్రమామనసేతి నైవేద్యమ్ :-**

**మంత్రం :** *ఓం చంద్రమా మనసో జాతః । చక్షో స్సూర్యో అజాయత ।*
*ముఖాదింద్ర శ్చాగ్నిశ్చ । ప్రాణాద్వాయు రజాయత ॥*

శ్లో॥ **నైవేద్యం గృహ్యతాం దేవ! భక్తిం మే హ్యచలాం కురు ।**
**ఈప్సితం మే వరం దేహి పరత్ర చ పరాంగతిమ్ ॥**

శ్లో॥ **శర్కరా ఖండ ఖాద్యాని దధిక్షీర ఘృతాని చ ।**
**ఆహారం భక్ష్యభోజ్యం చ నైవేద్యం ప్రతిగృహ్యతామ్ ॥**

**మంత్రం :** *ఓం భూర్భువస్సువః । ఓం తథ్సవితుర్వరేణ్యం*
*భర్గో దేవస్య ధీమహి । ధియో యో నః ప్రచోదయాత్ ॥*
*సత్యం త్వర్తేన పరిషించామి । అమృతమస్తు।*
*అమృతోపస్తరణమసి స్వాహా ॥*

శ్రీ **సుబ్రహ్మణ్యస్వామి** దేవతాభ్యోనమః ॥ ఓం ప్రాణాయ స్వాహా । ఓం అపానాయ స్వాహా । ఓం వ్యానాయ స్వాహా । ఓం ఉదానాయ స్వాహా । ఓం సమానాయ స్వాహా ॥ యథాసుఖం జుషధ్వమ్ ॥

*(పై మంత్రమును లేదా శ్లోకాన్ని పఠిస్తూ నివేదన చేయాలి.)*

శ్రీ **సుబ్రహ్మణ్యస్వామి** దేవతాభ్యోనమః నైవేద్యం సమర్పయామి, మధ్యే మధ్యే పానీయం సమర్పయామి। అమృతాపిధానమసి ॥ ఉత్తరాపోశనం సమర్పయామి। హస్త ప్రక్షాళనం సమర్పయామి । ముఖ ప్రక్షాళనం సమర్పయామి । కరోద్వర్తనం సమర్పయామి । పాద ప్రక్షాళనం సమర్పయామి । శుద్ధాచమనం సమర్పయామి॥ అని చెబుతూ ఉద్ధరిణతో నీటిని స్వామివారికి చూపించి పళ్లెంలో (అరివేణం) వేయాలి.

## 15. తాంబూలమ్

**నాభ్యా ఆసీదితి తాంబూలమ్**

**మంత్రం :** *ఓం నాభ్యా ఆసీదంతరిక్షమ్ । శీర్ష్ణోద్యౌ స్సమవర్తత ।*
*పద్భ్యాం భూమిర్దిశశ్శ్రోత్రాత్ । తథా లోకాగ్ం అకల్పయన్ ।*

శ్లో॥ **పూగీఫలం మహద్దివ్యం నాగవల్లీ దళైర్యుతమ్ ।**
**ఏలాలవంగ సంయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్ ॥**

శ్రీ **సుబ్రహ్మణ్యస్వామి** దేవతాభ్యోనమః – తాంబూలం సమర్పయామి ॥

## ఫల సమర్పణమ్

శ్లో॥ **ఇదం ఫలం మాయా దేవ స్థాపితం పురతస్తవ ।**
**తేన మే సఫలావాప్తిర్ భవేజ్జన్మని జన్మని ॥**

శ్రీ **సుబ్రహ్మణ్యస్వామి** దేవతాభ్యోనమః – ఫలం సమర్పయామి ॥

## దక్షిణా సమర్పణ

శ్లో॥ హిరణ్యగర్భ గర్భస్థం హేమబీజం విభావసోః ।
అనంత పుణ్యఫలదమతః శాంతిం ప్రయచ్ఛ మే॥

శ్రీ **సుబ్రహ్మణ్యస్వామి** దేవతాభ్యోనమః
సువర్ణపుష్పయుక్త దక్షిణాదీన్ సమర్పయామి॥

## 16. నీరాజనమ్

**వేదాహమేత మితి నీరాజనమ్ :-**

**మంత్రం :**

*ఓం వేదాహ మేతం పురుషం మహాంతమ్ । ఆదిత్యవర్ణం తమసస్తు పారే ।*
*సర్వాణి రూపాణి విచిత్య ధీరః । నామాని కృత్వాఽ ఉ భివదన్ యదాస్తే ॥*

శ్లో॥ **కదళీగర్భసంభూతం కర్పూరం తు ప్రదీపితమ్ ।**
**ఆరార్తికమహం కుర్వే పశ్య మాం వరదో భవ ॥**

ఓం భూర్భువస్సువః । శ్రీ **సుబ్రహ్మణ్యస్వామి** దేవతాభ్యో నమః । ఆనంద కర్పూర నీరాజనం సమర్పయామి ॥ (అని కర్పూరనీరాజనం ఇవ్వాలి.)
నీరాజనాన్తరం ఆచమనీయం సమర్పయామి॥

## మంత్రపుష్పమ్

**ధాతా పురస్తాదితి మంత్రపుష్పమ్ :-**

**మంత్రం :** *ఓం ధాతా పురస్తాద్యముదాజహార । శక్రః ప్రవిద్వాన్ ప్రదిశ శ్చతస్రః ।*
*తమేవం విద్వా నమృత ఇహ భవతి। నాన్యః పన్థా అయనాయ విద్యతే ॥*

శ్లో॥ **శ్రద్ధయా సిక్తయా భక్త్యా హార్దప్రేమ్ణా సమర్పితః।**
**మంత్రపుష్పాంజలిశ్చాయం కృపయా ప్రతిగృహ్యతామ్ ॥**

శ్రీ **సుబ్రహ్మణ్యస్వామి** దేవతాభ్యోనమః-సువర్ణదివ్య మంత్రపుష్పం సమర్పయామి॥

*(అక్షతలు, పూలు తీసుకొని స్వామివారి పాదాలచెంత సమర్పించాలి.)*

## నమస్కారాన్

**యజ్ఞేన యజ్ఞమితి నమస్కారాణి :-**

**మంత్రం :** *ఓం యజ్ఞేన యజ్ఞ మయజంత దేవాః తాని ధర్మాణి ప్రథమా న్యాసన్ ।*
*తే హ నాకం మహిమానస్సచన్తే యత్ర పూర్వే సాధ్యాస్సంతి దేవాః ॥*

శ్లో॥ **నమః సర్వహితార్థాయ జగదాధారహేతవే ।**
**సాష్టాంగోఽయం ప్రణామస్తే ప్రయత్నేన మయా కృతః ॥**

శ్లో॥ **నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్రపాదాక్షి శిరోరుబాహవే ।**
**సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే సహస్రకోటీ యుగధారిణే నమః॥**

శ్రీ **సుబ్రహ్మణ్యస్వామి** దేవతాభ్యోనమః-శిరఃసాష్టాంగ నమస్కారాన్ సమర్పయామి॥
*(స్వామివారి ముందు సాష్టాంగ నమస్కారం చేయాలి.)*

### పునఃపూజా - ఛత్రాది సమర్పణమ్

శ్రీ సుబ్రహ్మణ్యస్వామి దేవతాభ్యోనమః - ఛత్రం సమర్పయామి। చామరం వీజయామి। గీతం శ్రావయామి । దర్పణం దర్శయామి । నృత్యం సమర్పయామి । నాట్యం సమర్పయామి। సమస్త రాజోపచారాన్ సమర్పయామి । సమస్త దేవోపచారాన్ సమర్పయామి । సమస్త శక్తి భక్త్యుపచారాన్ సమర్పయామి।
*(స్వామివారి ముందు అక్షతలను సమర్పించాలి.)*

### అపరాధ - క్షమా యాచన

శ్లో॥ **ఆవాహనం నజానామి న జానామి తవార్చనమ్ ।**
**పూజాం చైవ నజానామి క్షమస్వ పరమేశ్వర ॥**

శ్లో॥ **మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం సురేశ్వర ।**
**యత్పూజితం మయా దేవ! పరిపూర్ణం తదస్తు తే ॥**

శ్లో॥ **అపరాధ సహస్రాణి క్రియం తేఽహర్నిశం మయా ।**
**దాసోఽయమితిమాం మత్వా క్షమస్వ పరమేశ్వర ॥**

శ్రీ సుబ్రహ్మణ్యస్వామి దేవతాభ్యోనమః–అపరాధ క్షమాపణం సమర్పయామి॥

*(స్వామివారికి నమస్కరించి అపరాధాల్ని క్షమించమని ప్రార్థించాలి.)*

## ప్రార్థన

శ్లో॥ **గతం పాపం గతం దుఃఖం గతం దారిద్ర్యమేవ చ ।**
**ఆగతా సుఖసంపత్తిః పుణ్యాచ్చ తవదర్శనాత్ ॥**

శ్లో॥ **రూపందేహి జయందేహి యశోదేహి ద్విషోజహి ।**
**పుత్రాన్ దేహి ధనందేహి సర్వాన్ కామాంశ్చ దేహి మే ॥**

శ్లో॥ **యద్దత్తం శక్తిమాత్రేణ పత్రం పుష్పం ఫలం జలమ్ ।**
**నివేదితం చ నైవేద్యం తత్గృహాణానుకంపయా ॥**

శ్రీ **సుబ్రహ్మణ్యస్వామి** దేవతాభ్యోనమః – ప్రార్థనం సమర్పయామి ॥

## పూజా సమర్పణమ్

శ్లో॥ **యస్మ స్మృత్యా చ నామోక్త్యా తపః పూజాక్రియాధిషు।**
**న్యూనం సంపూర్ణతాం యాతి సద్యోవందే తమచ్యుతమ్ ॥**

శ్లో॥ **మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం జనార్దన ।**
**యత్పూజితం మయా దేవ! పరిపూర్ణం తదస్తు తే॥**

అనేన మయా యథాజ్ఞానేన యథా మిళితోపచారద్రవ్యైః భక్త్యాకృత ధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజనేన శ్రీ **సుబ్రహ్మణ్యస్వామి** దేవతా సుప్రీత సుప్రసన్నో వరదో భవతు॥ సర్వం శ్రీ **సుబ్రహ్మణ్యస్వామి** దేవతా దివ్య చరణారవిందార్పణమస్తు॥

*(అక్షతలు, నీళ్లు తీసుకొని స్వామివారికి చూపించి పళ్లెంలో వేయాలి.)*

## ఉద్వాసనమ్

**యజ్ఞేన యజ్ఞమితి ఉద్వాసనం :-**

**మంత్రం :** *ఓం యజ్ఞేన యజ్ఞ మయజంత దేవాః తాని ధర్మాణి ప్రథమా న్యాసన్ ।*
*తే హ నాకం మహిమానస్సచన్తే యత్ర పూర్వే సాధ్యాస్సంతి దేవాః ॥*

శ్లో॥ **గచ్ఛ గచ్ఛ సురశ్రేష్ఠ స్వస్థాన జగదీశ్వర ।**
**భక్తాభీష్ట సమృద్ధ్యర్థం పునరాగమనాయ చ॥**

॥ శ్రీ సుబ్రహ్మణ్యస్వామి దేవతానం యథాస్థాన ముద్వాసయామి ॥

॥ఇతి పురుషసూక్తవిధాన దేవతార్చనమ్ సంపూర్ణమ్ ॥

*(పై తెలిపిన విధంగా శ్రీ సుబ్రహ్మణ్యస్వామివారి షోడశోపచార పూజా విధానాన్ని భక్తిశ్రద్ధలతో తమ శక్త్యానుసారం ఆచరించి స్వామివారి కరుణాకటాక్ష వీక్షణాలను పొందగలరు.)*

**సర్వేజనాః సుఖినోభవన్తు**



# మంత్రసిద్ధికి గురుదీక్ష ఆవశ్యకత

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః - గురుస్సాక్షాత్ పరంబ్రహ్మా తస్మైశ్రీ గురవే నమః

మంత్రసిద్ధి కావాలంటే సాధకునికి గురువు తప్పనిసరిగా అవసరం. శిష్యుడు తగిన గురువు కోసం అన్వేషించి, ఎంచుకోవాలి. గురువు సాధకుణ్ణి తన శిష్యునిగా స్వీకరించాకే దీక్షితుడిగా చేసి, మంత్రదీక్షని ప్రసాదిస్తాడు. గురువు మహిమ, సర్వోన్నతమైనది. శాస్త్రాల్లో మహర్షులు గురువుని భగవంతునితో సమానమనకుండా, భగవంతుని కంటే గొప్ప అని చెప్పారు. అటువంటి మహానుభావులైన గురువుల చరిత్ర విశిష్టమైంది. వారు నిజంగా తమ శిష్యులకు భగవంతుడికన్నా ప్రథమ పూజ్యులు. విశ్వామిత్ర, సాందీపులను శ్రీరాముడు, శ్రీకృష్ణుడు తమ గురువులుగా స్వీకరించి, వారి గొప్పతనాన్ని రుజువు చేశారు.

**గురుదీక్షా స్వీకారం :** దీక్ష స్వీకరించడానికి అనేక పద్ధతులున్నాయి. ఒక వ్యక్తిపేరు, తండ్రిపేరు, గోత్రం, నివాసస్థలం, రూపం లాంటివి... వేరొక వ్యక్తిపేరు, తండ్రిపేరు మొదలైనవాటితో ఎప్పటికీ కలవవు. సిద్ధగురువు తన సూక్ష్మశరీరం ద్వారా మీరు ఇంట్లో ఉన్నా మీకు దీక్ష ఇవ్వగలడు. ఒకవేళ మీకు గురువు నుంచి ప్రత్యక్షంగా దీక్ష తీసుకోవాలనే కోరిక ప్రబలంగా ఉండి ఉద్యోగ, కుటుంబ, ఆరోగ్య, వ్యక్తిగత సమస్యలు, ప్రతికూల పరిస్థితుల వల్ల గురువు దగ్గరకు వెళ్లలేనివారు పరోక్షంగా కూడా గురువు నుంచి దీక్ష తీసుకోవచ్చు.

**దీక్ష స్వీకరించినవారు పాటించాల్సిన నియమాలు**

1. గురుకృపతో లభించిన మంత్రాన్ని గుప్తంగా ఉంచాలి.
2. గురుమంత్రాన్ని సభలో, కుటుంబ సభ్యుల మధ్య, పదిమందిలో ఉన్నప్పుడు ప్రకటించకూడదు. 3. గురువు నిర్దేశించిన పూజావిధిని ఎక్కడా వ్యక్తం చేయకూడదు.
4. ధర్మబద్ధంగా గురువుపై, మంత్రంపై పూర్ణ విశ్వాసం, శ్రద్ధ, భక్తితో వాటిని రక్షించుకోవాలి. 5. ప్రాణులపట్ల దయ కలిగి ఉండాలి.
6. అసత్యం, పాపం, నింద, ద్వేషం, క్రోధం, ఈర్ష్య వంటి దుర్గుణాలను వదులుకోవాలి.

ఈ నియమాలు పాటిస్తూ గురువు ఆజ్ఞ ప్రకారం జీవితం గడిపే శిష్యులు, తమ సాధనల్లో సఫలీకృతులై తాము ఉపాసించే దేవతానుగ్రహం పొందుతారు.



# గురుమంత్ర దీక్ష

దేవతా మంత్రసాధన చేసేవారు సద్గురువు ద్వారా తాము ఉపాసించే మంత్రాన్ని ఉపదేశం పొంది ఆ తరువాత మాత్రమే సాధన చెయ్యాలి. అలాగే తనకు మంత్రాన్ని ప్రబోధించిన గురుమంత్రాన్ని కూడా జపిస్తే దేవతానుగ్రహం త్వరగా లభిస్తుంది. ఎందుకంటే గురువే దైవం కనుక. ఒకవేళ సద్గురువు ప్రత్యక్షంగా లభించే అవకాశం లేనప్పుడు సకల మంత్రశాస్త్ర ప్రభోదకుడైన పరమేశ్వరుడినే గురువుగా భావించి గురుమంత్ర సాధన చేయవచ్చు.

తాము ఉపాసించదలిచిన గురుమంత్రాన్ని ఒక కాగితంపై వ్రాసి దానిని శివాలయంలో శివుడి సన్నిధిలో ఉంచి, ఆయన ద్వారా, ఆ మంత్రాన్ని తాను ఉపదేశం పొందుతున్నట్టుగా భావించి తిరిగి ఆ కాగితాన్ని తీసుకుని తమ మంత్ర సాధన కొనసాగించవచ్చు. సాధకులకు గురువు లభించనప్పుడు సిద్ధగురువు అనుగ్రహం కోసం ఈ క్రింద తెలిపిన మంత్రాన్ని ఉపాసించవచ్చు.

సిద్ధగురు మంత్రం

**ఓం హ్రీం సిద్ధగురో ప్రసీద హ్రీం ఓం**

ఈ సిద్ధగురు మంత్రం జపించటం ద్వారా అంతరిక్షంలో సంచరించే ఎవరో ఒక సిద్ధగురువు సాధకుడిని అనుగ్రహిస్తాడు.

గురుమంత్రాన్ని గాని, సిద్ధగురు మంత్రాన్ని గాని సాధకులు తాము సాధనచేసే దేవతామంత్ర జపానికి ముందు ఒకమాల, జపానంతరం ఒకమాల జపించటం ద్వారా గురువు అనుగ్రహం దేవతానుగ్రహం సంపూర్ణంగా సాధకుడికి లభిస్తాయి.

గురుమంత్రాన్ని దేవతామంత్రం వలె పురశ్చరణ చేయవచ్చు.



# గురువు లభించనప్పుడు మంత్రదీక్షా స్వీకారం

మంత్ర సాధకులు సాధ్యమైనంత వరకూ గురువు ద్వారా మంత్రాన్ని ఉపదేశం పొంది జపిస్తేనే మంచిది. ముఖ్యంగా రాజస తామస దేవతా ఉపాసనల విషయంలో గురువు మార్గదర్శకత్వం చాలా అవసరం. అయితే సాత్విక దేవతా మంత్రాలు ఉపాసించాలనుకునే వారికి గురువు అందుబాటులో లేకపోయినా, దీక్ష స్వీకరించే అవకాశం లేకపోయినా వారు కూడా మంత్రదీక్ష స్వయంగా తీసుకునే మార్గం మంత్రశాస్త్రంలో ప్రమాణ గ్రంథమైన యామళ తంత్రంలో ఇలా చెప్పబడింది.

**గురోరభావే మంత్రాణాం గ్రహణ క్రమముచ్యతే ।**
**కృష్ణపక్షే త్రయోదశ్యాం దక్షిణామూర్తి సన్నిధే ॥**
**లభిత్వా రాజితే పాత్రే తాళపత్రేఽథవాపునః ।**
**మంత్రం తత్స్తండిలే స్థాప్య పూజయిత్వా మహేశ్వరమ్ ॥**
**పాయసాది నివేద్యం చ కృత్వా తంప్రణి పత్యచ ।**
**శతాకృతః పఠేన్మంత్రం దక్షిణామూర్తి సన్నిధౌ ॥**
**సర్వేషాంచైవ మంత్రాణామేవం గ్రహణ మిష్యతే ॥**

*ఆగమ రహస్యం - చతుర్ధపటలం (శ్లో 42-44)*

గురువు లభించనప్పుడు మంత్రాన్ని ఉపాసించాలనుకునే సాధకుడు కృష్ణపక్ష త్రయోదశి తిథినాడు దక్షిణామూర్తి సన్నిధికి (ప్రతి శివాలయంలో దక్షిణదిక్కున దక్షిణామూర్తి విగ్రహం వుంటుంది) ఒకవేళ దక్షిణామూర్తి ఆలయం అందుబాటులో లేకపోతే ఏదైనా శివాలయానికి వెళ్ళి వెండి లేదా రాగి రేకుమీద లేదా తాళపత్రం, అదీ దొరకకపోతే తెల్లకాగితం మీద ఉపాసించాలనుకున్న మంత్రాన్ని, లభించి దాన్ని స్వామి సన్నిధిలో ఉంచి యధాశక్తి పూజ చేయాలి. తరువాత పాయసాన్ని నివేదించి స్వామి సన్నిధిలో ఉంచిన మంత్రం లిఖించిన పత్రాన్ని తీసుకోవాలి. ఇప్పుడు గురుదక్షిణామూర్తి నుంచి మంత్ర స్వీకారం జరిగినట్టుగా భావించి స్వామి సన్నిధిలోనే ఆ మంత్రాన్ని 100 సార్లు జపించాలి. ఈ విధంగా మంత్రదీక్షని స్వీకరించవచ్చు. ఈవిధంగా దీక్ష కూడా తీసుకున్నవారు తాము మంత్రం పురశ్చరణ చేసే ముందు విధిగా గురుదక్షిణామూర్తిని గురుస్థానంలో ధ్యానించాలి.

# సకలమంత్ర సిద్ధికి భూతలిపి జపం

సాధారణంగా మనం జపంచేసే మంత్రాలు, అవి తాంత్రికమైనవైనా, వైదికమైనవైనా దేవలిపి అనగా దేవభాషయైన సంస్కృతంలో వుంటాయి. అయితే తంత్రశాస్త్రంలో చెప్పబడిన యంత్రాలను లిఖించే సమయంలో భూతలిపిని వినియోగిస్తారు. ఈ భూతలిపిలో వుండే అక్షరాలు సంస్కృతభాషలోని అక్షరాలే అయినప్పటికీ అక్షరానికి తరువాత బిందువుతో ప్రత్యేకంగా కనిపిస్తాయి. ఈ భూతలిపి అక్షరాల సాధన(జపం) వల్ల కుండలిని జాగృతమవుతుంది. ఈ భూతలిపి అన్ని విద్యలకి తల్లిలాంటిది. ఇది శరీరంలోని షట్చక్రాలను జాగృతం చేస్తుంది. అనంతమైన మంత్రశాస్త్రం ఈ భూతలిపి ఆధీనంలోనే వుంటుంది.

**42 అక్షరాల భూతలిపి**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| అం | ఇం | ఉం | ఋం | ౡం | ఏం | ఐం | ఓం | ఔం |
| హం | యం | రం | వం | లం | ఙం | కం | ఖం | గం |
| ఘం | ఞం | చం | ఛం | ఝం | జం | ణం | టం | ఠం |
| ఢం | డం | నం | తం | థం | ధం | దం | మం | పం |
| ఫం | భం | బం | శం | షం | సం | | | |

*(శారదాతిలక తంత్రమ్)*

**భూతలిపి జపవిధానం:-** పై తెలిపిన భూతలిపి అక్షరాల్ని మొత్తం ప్రతిరోజు ఒక 100సార్లు జపించాలి. కనీసం 11 సార్లయినా చేయాలి.

**భూతలిపి జపఫలితం:-** ఈ భూతలిపిని ప్రతిరోజు జపించడం వల్ల సాధకుడు ఉపాసించే అన్నిరకాల మంత్రాలు ఫలిస్తాయి. సాధకులు తాము ఉపాసించే మంత్రజపానికి ముందు జపం తరువాత 3 మాలలు కనీసం 1మాల ఈ భూతలిపి మంత్రాన్ని జపిస్తే మంత్రసిద్ధి తప్పక కలుగుతుంది. ఒక గ్లాసులోకి నీళ్ళను తీసుకొని ఈ భూతలిపి మంత్రాన్ని చదివి ఆ నీటిని ఊది రోగికి ఆ నీళ్ళను ఇస్తే వ్యాధి నయమవుతుంది. ఈ మంత్రం ఒక కాగితం మీద రాసి ఆ కాగితాన్ని బిందె నీళ్ళలోవేసి ఆ నీటిని తాగించినా రోగనివారణ జరుగుతుంది.

**శ్లో॥ గుహ్యాత్ గుహ్యతరం నిత్యం శ్రీభూతలిపి దేవతాం**
**యః సేవతే శుభైః పుత్రైః ధనధాన్యైశ్చ పూర్యతే ॥** *(శారదాతిలకమ్)*

అత్యంత రహస్యమైన ఈ భూతలిపిని ప్రతిరోజూ జపించే సాధకులు సమస్త సుఖాలను పొందుతారు. పుత్రపౌత్రాది పర్యంతం ఐశ్వర్యాన్ని పొందుతారు.

## మంత్రసిద్ధి లక్షణం (మంత్ర రత్నాకరం)

**సిద్ధే విశ్వస్త చిత్త స్సంస్తురీబ్దే స సిద్ధిభాక్ ।**
**మనః ప్రసాదస్సంతోషః శ్రవణం దుందుభిధ్వనే ॥**
**గీతస్య తాళ శబ్దస్య గంధర్వాణాం సమీక్షణం ।**
**స్వతేజస సూర్య సామ్యేక్షణం నిద్రాక్షుధాజపః ॥**
**రమ్యతారోగ్య గాంభీర్యా మభావః క్రోధలోభయోః ।**
**ఏవమాదీని చిహ్నాని యదాపశ్యతి మంత్రవిత్ ॥**
**సిద్ధం మంత్రస్య జానీయాద్దేవతాయాః ప్రసన్నతాం ।**
**తతోజపే దధికం యత్నం ప్రకుర్యాత్ జ్ఞానలబ్ధయే ॥**
**లబ్ధజ్ఞాన కృతార్థ స్స్యాత్సంసారాత్రృతి ముచ్యతే ।**
**జ్ఞాత్వాత్మానం పరంబ్రహ్మ వేదాంతైః ప్రతిపాదితమ్ ॥**

*(షట్కర్మాది నిరూపణ తరంగం, శ్లో॥97-101)*

మంత్రోపాసన చేసే సాధకుడికి మనసు ప్రశాంతంగా ఉండటం, ఎంతో సంతోషం కలగటం, దుందుభి, తాళ గీతాల ధ్వనులు వినిపించటం, గంధర్వులు కనిపించటం, తన తేజస్సు సూర్యుడిలా ప్రకాశించటం, మంచినిద్ర, క్షుధ (ఆకలి) జపం చేస్తున్నప్పుడు ఆనందానుభూతి కలగటం, శరీరం స్వస్థంగా వుండటం, మనసులో క్రోధం లోభం అనే దుర్గుణాలు తొలగిపోవటం లాంటి చిహ్నాలు కనిపిస్తే ఆ సాధకుడికి మంత్రసిద్ధి కలిగిందని, అతడు ఉపాసించే మంత్రదేవత ప్రసన్నమైందని మంత్రవేత్తలు చెప్తారు.

ఈవిధంగా మంత్రదేవత అనుగ్రహంతో మంత్రసిద్ధి పొందిన సాధకుడు పూర్తిగా జ్ఞానం కలగటం కోసం, తాను ఉపాసించే మంత్రాన్ని వదిలిపెట్టకుండా మరింత ఎక్కువగా జపించాలి. అలా జపించటం వల్ల తనను తాను పరబ్రహ్మగా (అహం బ్రహ్మాస్మి) తెలుసుకుని కృతార్థుడై, సంసార బంధాల నుంచి పూర్తిగా విముక్తి పొందుతాడు.

# శ్రీ సుబ్రహ్మణ్య మంత్ర పురశ్చరణ విధానం

**మంత్రం అంటే ఏమిటి ?**

మకారం మననం ప్రాహుస్త్రకారస్త్రాణ ఉచ్యతే
మనన త్రాణ సంయుక్తో మంత్ర ఇత్యభిధీయతే

'మననం' చేసే సాధకుడిని అన్ని రకాల విపత్తుల నుండి రక్షించేది కాబట్టి మంత్రం అని పిలువబడుతుంది. **మం=** అనగా మననం చేసేవాడిని, **త్ర=** అనగా రక్షించునది, అని మంత్ర శబ్దానికి అర్థం.

**జపం అంటే ఏమిటి ?**

**జకారో జన్మవిచ్ఛేదః పకారః పాపనాశకః ।**
**జన్మపాప వినాశిత్వా జ్జప ఇత్యభిధీయతే ॥**

**జ =** అనగా జన్మవిచ్ఛేదన చేసేది అంటే పునర్జన్మ లేకుండా చేసేది
**ప =** అనగా పాపాల్ని నశింపచేసేది అని జపశబ్దానికి అర్థం.

మంత్ర మహార్ణవం, మంత్రమహోదధి వంటి సుప్రసిద్ధ గ్రంథాలలో వివిధ దేవతా మంత్రాలని ఏ విధంగా జపంచేయాలి. ఏ మాల ఉపయోగించాలి. ఏ ఆసనం మీద కూర్చోవాలి. ఏ సమయంలో చేయాలి. ఏ రంగు వస్త్రాల్ని ధరించాలి. పురశ్చరణ ఏ విధంగా చేయాలి. అనే విషయాలు విపులంగా వివరించబడ్డాయి. ఆ గ్రంథాలలో పేర్కొన్న విధంగా మనం కూడా శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్రాన్ని పురశ్చరణా పూర్వకంగా జపించాలి. అప్పుడే మంత్రసిద్ధి జరుగుతుంది. ఆ మూలమంత్రంతో స్వయంగా చేసే జపం సత్ఫలితాన్నిస్తుంది.

**పురశ్చరణ అంటే :**

ఏ మంత్రాన్నైనా శాస్త్రోక్తంగా ఒక నియమిత పద్ధతిలో సాధన చేసే విధానాన్ని పురశ్చరణ అంటారు.

**పంచాంగోపాసనే నేష్టదేవతా ప్రీతిదానః ॥**
**పురశ్చరతి భక్తస్య తత్పురశ్చరణం ప్రియే ॥**

జపము, హెూమము, తర్పణము, మార్జనం, బ్రాహ్మణ భోజనం ఇవి పురశ్చరణలోని పంచాంగాలు. ఈ ఐదు విధాలైన కర్మచేత మనం ఉపాసించే దేవత (శ్రీ సుబ్రహ్మణ్యస్వామి) సంతోషించి **పురః** = బిడ్డలమైన మన ముందు, **చరతి** = సంచరిస్తుంది. కాబట్టి దీనికి పురశ్చరణ అనే పేరు వచ్చింది.

**పురశ్చరణ ఎందుకు ?**

**జీవహీనోయధాదేహీ సర్వకర్మసు న క్షమః ।**
**పురశ్చరణ హీనో హి తధామంత్రః ప్రకీర్తితః ॥**

జీవంలేని దేహం ఎలాగైతే కార్యసాధనకి పనికిరాదో అలాగే పురశ్చరణ లేని మంత్రం కూడా నిరర్ధకమైనదని భావం. కాబట్టి శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్రాన్ని పురశ్చరణ పూర్వకంగా ఉపాసిస్తేనే ఆ దేవుడి అనుగ్రహం మనకు లభిస్తుంది.

**పురశ్చరణ సంఖ్య :**

వివిధ మంత్రశాస్త్ర గ్రంథాలలో వివరించిన ప్రకారంగా ఏ మంత్రానికైనా 1) ఒక లక్ష సార్లు అనగా (**108** సంఖ్య గల మాలతో **1000** మాలలు) మూల మంత్రాన్ని జపం చేయాలి. 2) అందులో పదో వంతు అనగా **10 వేల** సార్లు ఆ మూలమంత్రంతో హెూమం చేయాలి. 3) హెూమ సంఖ్యలో పదోవంతు అనగా ఒక **వెయ్యి** సార్లు ఆ మూలమంత్రంతో తర్పణ చెయ్యాలి. 4) తర్పణ సంఖ్యలో పదోవంతు. **100** సార్లు మూలమంత్రంతో మార్జన లేదా అభిషేకం చెయ్యాలి. 5) అందులో పదో వంతు. **10** మంది బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి. ఈ ఐదు పనులతో మంత్ర పురశ్చరణ పూర్తవుతుంది. (ఇక్కడ శాస్త్రంలో బ్రాహ్మణ భోజనం అని వున్నప్పటికీ ఏ పదిమందికైనా భోజనం పెట్టవచ్చు)

**మంత్రోపదేశం :**

మంత్రశాస్త్ర నియమం ప్రకారం ఏ మంత్రాన్నైనా సిద్ధిపొందిన ఒక గురువు నుండి ఉపదేశం పొంది, పురశ్చరణ పూర్వకంగా ఉపాసించాలి. అలా కాకుండా గ్రంథాలను చూసి సాధన చేస్తే ఇబ్బందులకు గురయ్యే అవకాశం ఉంటుంది. సాధకులు ఈ విషయాన్ని ముఖ్యంగా దృష్టిలో ఉంచుకోవాలి.

**గురువు లభించకపోతే :**

ఒకవేళ సమయానికి గురువు లభించకపోతే ఒక కాగితం మీద మీరు జపం చేయదలుచుకున్న **శ్రీ సుబ్రహ్మణ్య** మంత్రాన్ని రాసి, దానిని శివాలయానికి తీసుకువెళ్ళి, శివలింగం దగ్గర ఆ కాగితాన్ని వుంచి, సకల మంత్రాలకు సృష్టికారకుడైన జగద్గురువు పరమేశ్వరుడి నుంచి మంత్రోపదేశం పొందుతున్నట్టుగా మీరు భావించి తిరిగి ఆ కాగితాన్ని తీసుకుని మంత్రజపాన్ని చేయవచ్చు.

**దేవత-మంత్రం-గురువు :**

సాధకులు తాము ఉపాసించే మంత్రాన్ని ఉపదేశించిన గురువుని ఒకేలాగా చూడాలి.

**శ్లో॥ యధాఘటశ్చ కలశః కుంభశ్చైకార్ధ వాచకాః ।**
**తధా మంత్రో దేవతా చ గురుశ్చైకార్ధ వాచకాః ॥**
**శ్లో॥ యధాదేవీ తథామంత్రే యథామంత్రే తథాగురౌ ।**
**యథాగురౌ తథా స్వాత్మాన్యేవం భక్తిక్రమః స్మృతః ॥**

ఘటం, కశలం, కుంభం ఈ మూడూ ఎలాగైతే ఒకే అర్థానిస్తున్నాయో అదేవిధంగా మంత్రం-దేవత-గురువు అనే మూడు పదాలు కూడా ఒకే అర్థం కలిగిన పదాలుగా మనం గ్రహించాలి.

సాధకుడికి ఉపాసించే దేవతమీద ఎటువంటి భక్తి ఉంటుందో అలాంటి భక్తే మంత్రంమీద, గురువుమీద కలిగి ఉండాలి. ఇలా ఎవరైతే ముగ్గురినీ ఏకాత్మకంగా భావిస్తారో అటువంటి సాధకుడికే మంత్రం త్వరగా సిద్ధిస్తుంది.

**జపం చేయటానికి మంచి రోజు :**

శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్రాన్ని పురశ్చరణా పూర్వకంగా అనుష్టానం చేయాలనుకునే సాధకులకి కార్తీకమాసం, షష్ఠి, మంగళవారం, ఆదివారం మంచిరోజులు.

**జపస్థానం :** శ్రీ సుబ్రహ్మణ్య దేవతామంత్రాన్ని జపించాలనుకొనే సాధకులు. మంత్రశాస్త్రంలో చెప్పిన విధంగా

**పుణ్యక్షేత్రం నదీతీరం గుహా పర్వత మస్తకం**
**తీర్థ ప్రదేశా స్సింధూనాం సంగమః పావనం వనం**
**ఉద్యానాని వివిక్తాని బిల్వమూలం తటం గిరేః**
**దేవతాయతనంకూలం సముద్రస్య నిజం గృహం**
**సాధకేషు ప్రశస్త్యన్తే స్థానాన్యేతాని మంత్రిణం** *(శారదాతిలకం)*

పుణ్యక్షేత్రం, నదీతీరం, గుహ, పర్వతాగ్రం, తీర్థ ప్రదేశాలు, సాగర సంగమ స్థలాలు, పవిత్ర వనాలు, జనసంచారంలేని ఉద్యానవనాలు బిల్వవృక్ష మూల ప్రదేశాలు, కొండలు, దేవాలయాలు, సముద్ర తీరాలు, స్వగృహాలు. ఇవన్నీ పురశ్చరణకు స్థానాలుగా చెప్పబడ్డాయి. కనుక ఈ ప్రదేశాలలో ఎక్కడైనా జపం చేయవచ్చు. పై తెలిపిన స్థానాలతో పాటు శ్రీ సుబ్రహ్మణ్యస్వామి ఆలయాలలో, శివాలయాలలో జపంచేస్తే, త్వరగా శ్రీ సుబ్రహ్మణ్యస్వామి అనుగ్రహం లభిస్తుంది.

**మంత్ర జపాంగాలు :**

మంత్ర జపానికి ముందుగా చేయవలసిన విధులని పదిఅంగాలుగా మంత్రశాస్త్రాల్లో చెప్పారు. అవి 1.భూశుద్ధి, 2.కూర్మచక్రలేఖనం, 3.ఆసన పరికల్పనం, 4.శిఖా బంధనం, 5.భూత శుద్ధి, 6.దిశా దిగ్బంధం, 7.షడంగ న్యాసం, 8.ప్రాణప్రతిష్ఠ, 9.బహిర్మాతృకా న్యాసం, 10.అంతర్మాతృకా న్యాసం. ఈ పది అంగాలలో కనీసం ముఖ్యమైన అంగాలని జపంచేసే సాధకుడు ఆచరించాలి.

**భూశుద్ధి :**

జపంచేసే సాధకుడు ముందుగా గురువుకి, గణపతికి నమస్కారం చేసి తాను జపం చేయబోయే స్థలాన్ని శుభ్రం చేయాలి. ఆ స్థానంలో దర్భలతో కొంచెం నీరుచల్లి..

**శ్లో॥ విష్ణుశక్తి సముత్పన్నే శంఖవర్ణ మహీతలే ।**
**అనేకరత్న సంపన్నే శ్రీ భూదేవీ నమోஉస్తుతే ॥**

అనే ధ్యానశ్లోకాన్ని చదివి, కొంచెం అక్షతలు వేసి

**భూగాయత్రీ మంత్రం :**

**ఓం ధనుర్ధరాయవిద్మహే సర్వసిద్ధ్యై చ ధీమహి**
**తన్నో ధరాః ప్రచోదయాత్ ।**

అని పదిసార్లు పై మంత్రాన్ని పఠించి, తను చేయబోయే మంత్రాన్ని కూడా మనసులో ఒకసారి స్మరించి చేతిలో కొంచె నీళ్ళు తీసుకొని జపస్థలంలో చల్లి, దర్భలతో **'హుంఫట్'** అని చెప్తూ ఒకసారి నేలని కొట్టాలి.

**ఆ తరువాత :**

**ఆపసర్పంతు యే భూతాః యేభూతాః భూమిసంస్థితాః ।**
**యే భూతా విఘ్న కర్తారః తే నశ్యంతు శివాజ్ఞయా ॥**

అని చదివి జప స్థలంలో కొద్దిగా అక్షతలు చల్లాలి.

## కూర్మచక్రం

భూతశుద్ధి చేసిన తరువాత ఈ క్రింద తెలిపిన విధంగా ముగ్గుతో కానీ, తెల్ల సుద్దతో కానీ నేలమీద కూర్మచక్రాన్ని లిఖించాలి.




ఈ కూర్మచక్రం మీద ఓం ఆధారశక్త్యై నమః, ఓం కూర్మాయ నమః, ఓం అనంతాయ నమః, ఓం వరాహాయ నమః,, ఓం పృథివ్యై నమః, ఓం సుధార్ణవాయ నమః, ఓం నవరత్నద్వీపాయ నమః, ఓం స్వర్ణశైలాయ నమః, ఓం నందనవనాయ నమః, ఓం కల్పవృక్షేభ్యో నమః, ఓం రత్న భూమికాయై నమః, ఓం సర్ణప్రాకారాయ నమః, ఓం రత్నమండపాయ నమః, ఓం స్వర్ణవేదికాయై నమః అని చెపుతూ కొన్ని అక్షతలతో కూర్మచక్రాన్ని పూజించాలి. పూజానంతరము కూర్మచక్రముపై ఆసనాన్ని వేసుకోవాలి.

**జపానికి ఆసనం :**

**ఆత్మసిద్ధి ప్రదానశ్చ సర్వరోగ నివారణాత్ ।**
**నవసిద్ధి ప్రదానాశ్చ ఆసనం పరికీర్తనమ్ ॥**

మంత్ర జపానికి ఆసనం చాలా ముఖ్యమైనది. అసలు ఆసనం అంటే

**ఆ** = అనగా ఆత్మ సాక్షాత్కారాన్ని కలిగించేది.

**స** = అనగా సర్వ రోగాలని హరించేది.

**నం** = నవ సిద్ధులను ఇచ్చేది 'ఆసనం' అని చెప్పబడుతుంది.

శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్రం జపం చేయటానికి ఆసనం ఎంతో అవసరం. ప్రతిరోజూ ఒక శుభస్థానంలో కూర్చుని జపంచేయాలి కాబట్టి, వేసుకునే ఆసనం కూడా దేవతకు ఇష్టమైన రంగులో ఉండేలా చూసుకోవాలి. శ్రీ సుబ్రహ్మణ్యస్వామికి ప్రీతికరమైన రంగు ఎరుపువర్ణం కనుక ఆ రంగులో ఉండే ఆసనాన్ని ఉపయోగించాలి.

**"కుశాసనే మంత్రసిద్ధిర్నాత్ర కార్యా విచారణా"** అని శాస్త్రంలో చెప్పబడింది కాబట్టి దర్భాసనం మంత్రసిద్ధికి తోడ్పడుతుంది. కనుక దర్భాసనం మీద ఎరుపు రంగుగల ఆసనాన్ని వేసుకుని జపం చేయవచ్చు.

**1. ఆసనమంత్రం :**

ఆసనం మీద కూర్చున్న తరువాత ఆసనం చుట్టూ ఆగ్నేయంలో **గం గణపతయే నమః**, వాయువ్యంలో **దుం దుర్గాయై నమః**, నైరుతిలో **సం సరస్వత్యై నమః**, ఈశాన్యంలో **క్షం క్షేత్రపాలకాయ నమః** అని చెప్పి కొన్ని అక్షతలు పూలు వేయాలి.

**గమనిక : క్రింద కూర్చోలేనివారు, శరీరం సహకరించనివారు, వృద్ధులు, కుర్చీలో ఆసనం వేసుకుని జపం చేసుకోవచ్చు. హోమం చేసుకోవచ్చు.**

**జపానికి కావలసిన వస్తువులు :**

1.సుబ్రహ్మణ్యుడి చిత్రపటం, 2.సుబ్రహ్మణ్యుడి యంత్రం, 3.సుబ్రహ్మణ్యుడి మంత్రం చెక్కిన రాగిరేకు లేదా మంత్రం లిఖించిన పత్రం, 4.ఒక రాగిపళ్లెం, 5. ఉద్ధరిణ, పంచపాత్ర, 6.అక్షతలు, 7.వివిధ రంగుల పువ్వులు, 8.రుద్రాక్ష/పగడాల జపమాల, 9.ఎరుపురంగు ఆసనము, 10.ఎరుపురంగు వస్త్రాలు, 11.దర్భాసనం.

**జపమాల :**

శ్రీ సుబ్రహ్మణ్య దేవతా జపానికి పగడాలమాల, గంధంపూసల మాల లేదా రుద్రాక్షమాల వీటిలో దేనినైనా ఉపయోగించవచ్చు.

*(మాల 108 పూసలతో వుండాలి)*

**గమనిక : జపమాలని మెడలో ధరించకూడదు.**

**వస్త్రం :**

శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్ర పురశ్చరణ చేసే సాధకులు ఎరుపు రంగు పంచె ఉత్తరీయాన్ని ధరించాలి.

**గమనిక : జపం చేసేదప్పుడు ధరించిన వస్త్రాలతో భోజనం చేయకూడదు.**

**జపం చేసే దిక్కు:**

శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్రాన్ని పురశ్చరణ చేసే సాధకులు ఉత్తరం, తూర్పుదిక్కుకి అభిముఖంగా కూర్చుని జపం చేస్తే శుభప్రదంగా వుంటుంది.

**జపం చేయవలసిన రోజులు :**

సాధారణంగా జపాన్ని సాధకులు తమకు అనువైనన్ని రోజులలో **10** లేక **20** లేక **40** రోజులలో జపాన్ని పూర్తి చేయవచ్చు. అయితే తాము స్వీకరించిన రోజుల్లో మొత్తం జపసంఖ్యని ఆ రోజులకి అనుగుణంగా విభాగించుకుని ప్రతిరోజూ అదే సంఖ్య తగ్గకుండా జపంచేయాలి. ఉదా: **10** రోజులు స్వీకరిస్తే **1** లక్ష జపాన్ని (అనగా వేయి మాలలు) రోజుకి (**100×10** చొప్పున మొత్తం పదిరోజులకి **1000** మాలలు జపం చేయాలి. ఇదేవిధంగా మీరు స్వీకరించిన రోజులను బట్టి జపమాలల సంఖ్యను సమంగా స్వీకరించి జపం చేయాలి.

**జపం పద్ధతులు :**

1. వాచికం (పైకి వినబడేలా చేసేది) 2. ఉపాంశువు = పెదవులతో పైకి వినబడకుండా నోటితో చేసేది 3. మానసికం = పెదవులు కదలకుండా నోటితో కాకుండా కేవలం మనసులోనే జపించేది. పై మూడింటిలో మానసికమే ఉత్తమమైనది కాబట్టి శ్రీ సుబ్రహ్మణ్య దేవతా రూపాన్ని మనసులో ధ్యానిస్తూ మంత్రాన్ని స్పష్టంగా కళ్ళు మూసుకునిగానీ, నాసికాగ్రం పై దృష్టి నిలిపిగానీ, మానసికంగా జపం చేయాలి.

**జపం చేసే విధానం :**

జపాన్ని చేసే సాధకులు జపమాలని ఉంగరం వేలుమీద ఉంచి బొటనవేలు, మధ్యవేలు ఈ రెండింటితో మాలలోని పూసని, మంత్రాన్ని జపిస్తూ తనవైపుకి లోనికి లాక్కోవాలి. కొలికి పూస వేలికి తగిలేవరకూ లెక్కించి దీనిని దాటకుండా మాలని వెనక్కితిప్పి మరల జప గణన చేయాలి. చూపుడువేలు మాలకు తగలకుండా, జపమాల నేలకు తగలకుండా, క్రిందకు జారిపడకుండా, సాధకుడు జాగ్రత్తపడాలి.

***(గోముఖం అనగా జపం చేయటానికి ఉపయోగించే సంచిని వినియోగించండి)***

**మంత్రాన్ని ఎలా జపించాలి :**

ఉచితాసనం మీద కూర్చుని మాలను స్వీకరించి జపాన్ని చేసే సాధకుడు. **"అక్షరాక్షర సంయుక్తం జపేన్మౌక్తిక పంక్తివత్"** ముత్యాల వరసలాగా అక్షర అక్షరం స్పష్టంగా వుండేలా అక్షరాక్షర సంయుక్తంగా జపించాలి.

**గమనిక : 1) అలాగే మాలని ఎవరికంటా పడకుండా గోముఖం సంచిలో వుంచిగానీ, ఉత్తరీయం అడ్డుగా వుంచిగానీ జపం చేయాలి. 2) జపమాలను క్రింద పడవేయకూడదు. 3) ప్రతిరోజూ నియమిత జపం పూర్తయిన తరువాత జపమాలను పవిత్రమైన ప్రదేశంలో వుంచాలి.**

**జప నియమాలు :**

**సత్యేనాపి న భాషేత జపహోమార్చనాదిషు ।**
**అన్యథానుష్ఠితం సర్వం భవత్యేవ నిరర్థకం ॥**

జపం చేసేటప్పుడు హోమం చేసేటప్పుడు పూజలు చేసేటప్పుడు సత్యమైన అత్యవసరమైన విషయాల గురించైనా సరే మధ్యలో ఇతరులతో ఏమీ మాట్లాడకూడదు. అలా మాట్లాడితే ఆ జపం, హోమం, పూజ నిరర్థకమవుతాయి. కాబట్టి జాగ్రత్త వహించి ఎవరితో మాట్లాడకుండా శ్రీ సుబ్రహ్మణ్య దేవతామంత్రాన్ని ఏకాతంగా అనుష్టానం చేయాలి.

**జపంలో ధ్యానం :**

శ్రీ సుబ్రహ్మణ్య దేవతామంత్రాన్ని తదేకదీక్షతో జపం చేస్తున్నప్పుడు కొంత మంది సాధకులకు ఏకాగ్రస్థితి వచ్చి మంత్ర జపం ఆగిపోవచ్చు. ఆ సమయంలో శ్రీ సుబ్రహ్మణ్య దేవతా దివ్య మంగళాకారాన్ని దర్శిస్తూ తాదాత్మ్యంలో వుండిపోవచ్చు. ఆ స్థితి చాలా గొప్పది. ఆ స్థితిలో వున్నంతసేపు వుండి, తిరిగి సాధారణ స్థితికి వచ్చాక మరల జపాన్ని ప్రారంభించవచ్చు.

**జపాన్ని ఏ సమయంలో చేయాలి :**

శ్రీ సుబ్రహ్మణ్య మంత్రాన్ని ఉదయం సమయంలో చేస్తే మంచిది.

**జపం చేయడానికి ముందు :**

జపానికి ముందు ఒకపళ్లెంలో శ్రీ సుబ్రహ్మణ్య యంత్రాన్ని, ఇది లభించకపోతే మీరు ఉపాసించే శ్రీ సుబ్రహ్మణ్య మంత్రాన్ని ఒక రాగి రేకుమీద చెక్కించి లేదా ఒక కాగితం మీద రాసి ఆ యంత్రాన్ని పళ్లెంలో వుంచి వివిధ రంగులపువ్వులు, అక్షతలు తీసుకుని శ్రీ సుబ్రహ్మణ్య అష్టోత్తర శతనామాలతో యంత్రాన్ని / మంత్రాన్ని పూజించాలి. ఆ తరువాత జపం ప్రారంభించాలి.

**గమనిక :**

**బాసుమతి బియ్యంలో కుంకుమ పొడిని కొంచెం నేతితో కలిపి విడివిడిగా అక్షతలుగా చేసి వియోగించవచ్చు.**

**దిగ్బంధనం :** పూజ చేసిన తరువాత ఎర్రని అక్షతలు కొన్ని తీసుకుని

**శ్లో॥ సుదర్శనస్య మంత్రేణ దిశాబంధనం సమాచరేత్ ।**
**భూతశుద్ధిం తతః కృత్యా ప్రాణస్థాపన మాచరేత్ ॥**

**"ఓం నమో భగవతే మహాచక్రరాజాయ సహస్రారాయ సర్వ దిశోబంధ, భూతాం స్తాదయ. రాక్షసాన్మారయ, సహస్రార హుంఫట్ క్రోం రం స్వాహా"** అనే సుదర్శన మంత్రాన్ని చదివి అక్షతలని తనచుట్టూ వేసుకుని జపాన్ని ప్రారంభించాలి.

# శ్రీ సుబ్రహ్మణ్య మంత్ర జప ప్రారంభం

**జప సంకల్పం :**

**ముందుగా ఉద్ధరిణ, పంచపాత్ర తీసకుని**

1. ఓం కేశవాయస్వాహా 2. ఓం నారాయణాయస్వాహా 3. ఓం మాధవాయస్వాహా అని మూడు సార్లు ఆచమనం చేసి, ఆ తరువాత ప్రాణాయామం చేసి

**మమ ఉపాత్త సమస్త దురితక్షయ ద్వారా శ్రీ మహావిష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య ఆద్య బ్రహ్మణః ద్వితీయపరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే మేరోః దక్షిణ దిగ్భాగే --- దేశే భగవత్సన్నిధౌ అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన --- సంవత్సరే --- ఆయనే --- ఋతౌ --- మాసే --- పక్షే --- తిథౌ --- వాసరే --- నక్షత్రే శుభయోగే శుభకరణే ఏవం గుణ విశేషణ విశిష్టాయాం --- గోత్రోద్భవస్య ---అహం శ్రీ సుబ్రహ్మణ్య దేవతా ప్రీత్యర్థం పురశ్చరణ పూర్వక. శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్ర జపం కరిష్యే...**అని సంకల్పం చెప్పుకుని ఉంగరం వేలితో పంచపాత్రలో నీటిని తాకవలెను. తరువాత మనసారా శ్రీ సుబ్రహ్మణ్య స్వామికి నమస్కారం చేసుకుని జపానికి ఏ విఘ్నాలు కలుగకుండా ముందుగా...

**శ్రీ గణపతి ప్రార్థన :**

**వక్రతుండ మహాకాయ కోటి సూర్య సమప్రభా ।**
**నిర్విఘ్నం కురు మే దేవ సర్వకార్యేషు సర్వదా ॥**

అని గణపతికి ముందుగా నమస్కారం చేయండి.

**గమనిక : పురశ్చరణకోసం చేసే సంకల్పంలో తమ కోరికలు చెప్పుకోకూడదు కేవలం దేవతా ప్రీతికొరకే సంకల్పించాలి.**

**గురు వందనం :**

**గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః**
**గురుస్సాక్షాత్ పరంబ్రహ్మా తస్మైశ్రీ గురవేనమః ॥**

అని మీకు మంత్రదీక్ష ఇచ్చిన గురువుకి ముందుగా నమస్కరించండి.

## శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్రం (ఆమ్నాయ మందారం)

**ఓం శ్రీం హ్రీం క్లీం సం శరవణభవాయ స్వాహా**

అస్య శ్రీ సుబ్రహ్మణ్యమంత్రస్య అగస్త్యఋషిః। అనుష్టుప్ ఛందః। శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరో దేవతా। ఓం బీజం। సం శక్తిః। శరవణభవ ఇతి కీలకం। మమాభీష్ట సిద్ధ్యర్థం జపే వినియోగః

### కరన్యాసం

| | | |
|---|---|---|
| హ్రాం హిరణ్యవర్ణాయ | - | అంగుష్ఠాభ్యాం నమః |
| హ్రీం ప్రతీకారనికేతనాయ | - | తర్జనీభ్యాం నమః |
| హ్రూం సంకల్పసాధనాయ | - | మధ్యమాభ్యాం నమః |
| హ్రైం ఇక్షుధనుర్ధరాయ నమః | - | అనామికాభ్యాం నమః |
| హ్రౌం శిఖివాహనాయ నమః | - | కనిష్ఠికాభ్యాం నమః |
| హ్రః శక్తిహస్తాయ నమః | - | కరతలకరపృష్ఠాభ్యాం నమః |

### హృదయన్యాసం

| | | |
|---|---|---|
| హ్రాం హిరణ్యవర్ణాయ | - | హృదయాయ నమః |
| హ్రీం ప్రతీకారనికేతనాయ | - | శిరసేస్వాహా |
| హ్రూం సంకల్పసాధనాయ | - | శిఖాయైవషట్ |
| హ్రైం ఇక్షుధనుర్ధరాయ నమః | - | కవచాయ హుం |
| హ్రౌం శిఖివాహనాయ నమః | - | నేత్రత్రయాయౌషట్ |
| హ్రః శక్తిహస్తాయ నమః | - | అస్త్రాయ ఫట్ |

**భూర్భువస్సువరోమితి దిగ్బంధః**

**శ్రీ సుబ్రహ్మణ్య దేవతా ధ్యానం :**

కనకమండల మండితం షణ్ముఖం
వనజరాజవిరాజిత లోచనమ్ ।
నిశితశస్త్ర శరాసన ధారిణం
శరవణోద్భవమీశసుతం భజే ॥

## లమిత్యాది పంచపూజలు

పంచపాత్రలో నీటిని ఉద్ధరిణతో తీసుకుని శ్రీ సుబ్రహ్మణ్య దేవతాయై **నమః పాద్యం** సమర్పయామి **అర్ఘ్యం** సమర్పయామి **ఆచమనం** సమర్పయామి అంటూ అరివేణం (పళ్ళెం)లో పోయాలి.

**లం** పృథివీ తత్వాత్మికాయై శ్రీ సుబ్రహ్మణ్య దేవతాయై గంధం ధారయామి
**హం** ఆకాశతత్వాత్మికాయై శ్రీ సుబ్రహ్మణ్య దేవతాయై పుష్పైః పూజయామి
**యం** వాయుతత్వాత్మికాయై శ్రీ సుబ్రహ్మణ్య దేవతాయై ధూపం అఘ్రాపయామి
**రం** తేజస్తత్వాత్మికాయై శ్రీ సుబ్రహ్మణ్య దేవతాయై దీపం దర్శయామి
**వం** అమృతతత్వాత్మికాయై శ్రీ సుబ్రహ్మణ్య దేవతాయై అమృత నైవేద్యం సమర్పయామి
అని చెపుతూ ఉద్ధరణితో నీటిని ఐదు సార్లు అరివేణం (పళ్ళెం)లో వేయాలి.

**జపమాల మంత్రం :**

శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్ర జపాన్ని ప్రారంభించటానికి ముందు సాధకుడు జపమాలను చేతితో తీసుకుని కళ్ళకు అద్దుకుని మనసులో

**ఓం మాం మాలే మహామాయే సర్వమంత్ర స్వరూపిణి ।**
**చతుర్వర్గ స్త్వయిన్యస్త స్తస్మాన్మే సిద్ధిదా భవ ॥**

అని మనసులో తలచుకుని భక్తి పూర్వకంగా నమస్కరించి జపం చేయటం ప్రారంభించాలి.

**గురు మంత్రం :**

మీకు దీక్షనిచ్చిన గురువు ద్వారా గురుమంత్రోపదేశాన్ని పొంది ఆ మంత్రాన్ని శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్రానికి ముందుగా ఒక మాలని, అలాగే జపం పూర్తయిన

తరువాత ఒక మాలని జపం చేయాలి. తద్వారా గురువు అనుగ్రహం లభించి దేవతామంత్రసిద్ధి మీకు త్వరగా కలుగుతుంది.

**శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్రం :**

ఓం శ్రీం హ్రీం క్లీం సం శరవణభవాయ స్వాహా

అని శ్రద్ధాభక్తులతో మౌనంగా మనస్సులో మూలమంత్ర జపం చేయండి.

**జపాంత విధి :**

**సువర్ భువర్ భూరితి దిగ్విమోకః** అని దిగ్విమోచనం చేసి, మరల పై తెలిపిన ధ్యాన శ్లోకం చదివి ఈ క్రింది విధంగా చెపుతూ జపసమర్పణ చేయాలి.

**జప సమర్పణ :**

పై తెలిపిన విధంగా ప్రతిరోజూ నియమిత సంఖ్యలో జపం చేయటం పూర్తయిన తరువాత, తిరిగి మూడు సార్లు ఆచమనం చేసి కొన్ని నీళ్ళు చేతిలో తీసుకుని **అనేన మయాకృతేన శ్రీ సుబ్రహ్మణ్యా దేవతా మంత్ర జపేన శ్రీ సుబ్రహ్మణ్యా దేవతా సుప్రీతో సుప్రసన్నో వరదో భవతు. శ్రీ సుబ్రహ్మణ్యా దేవతా సంపూర్ణ అనుగ్రహ కటాక్ష సిద్ధ్యర్థం ఏతత్ జపఫలం శ్రీ సుబ్రహ్మణ్యా దేవతా చరణారవిందార్పణమస్తు... తత్సత్ బ్రహ్మార్పణమస్తు**

అని ఆ నీటిని అరివేణం (ఒక పళ్ళెం)లో విడవాలి. అలా విడిచిన నీటిని మూడు సార్లు తీర్థంగా తీసుకోవాలి.

**మీరు జపం చేసే అన్ని రోజులూ ఇదే విధంగా చేయాలి.**

**జపానంతరం మాలామంత్రం :**

శ్లో ॥ ఓంత్వంమాలే సర్వదేవానాం ప్రీతిదా శుభదా భవ ।
శుభం కురుష్వ మే భద్రే యశోవీర్యం చ దేహిమే ॥

**మంత్రం :** ఓం హ్రీం సిద్ధ్యై నమః (మంత్రమహోదధి)

ఈ విధంగా పై శ్లోకాన్ని, మంత్రాన్ని పఠించి జపమాలని ఒకసారి తలపై వుంచుకొని తరువాత మీరు జపంచేసే గోముఖం (సంచి)లో భద్రపరుచుకోవాలి. ఈ మాలని ఎవరూ చూడకూడదు. ఎవరికి ఇవ్వకూడదు, అశుచిగా తాకకూడదు.

**జప ప్రాశస్త్యం :**

పైన తెలిపిన నియమాలను ఆచరిస్తూ అచంచల భక్తి విశ్వాసాలతో జపాన్ని చేస్తే ఎన్నో శుభఫలితాలు కలుగుతాయి.

**జపేన దేవతా నిత్యం స్తూయమానా ప్రసీదతి**
**ప్రసన్నా విపులాన్భోగాన్ దద్యాన్ముక్తించ శాశ్వతీం**
**యక్ష రక్షః పిశాచాశ్చ గ్రహాస్సర్వాశ్చ భీషణాః**
**జాపినం నోపసర్పంతి భయభీతా స్సమంతతః**
**యావంతః కర్మయజ్ఞానుస్స్యుః ప్రతిష్ఠాశ్చ తపాంసి చ**
**సర్వే తే జపయజ్ఞస్య కలాం నార్హంతి షోడశీం**
**మాహాత్మ్యం వాచకస్మైత జ్జపయజ్ఞస్య కీర్తనం ॥**

జపం చేయటం ద్వారా స్తుతించబడ్డ దేవతలు నిత్యం సాధకుడికి ప్రసన్నమై వుంటారు. వారికి శాశ్వత భోగ మోక్షాల్ని ప్రసాదిస్తారు. యక్ష, రక్షః పిశాచాలు, దుష్టగ్రహాలు, జపంచేసే వాడిని చూసి భయపడతాయి.

తపస్సులు, కర్మయజ్ఞాలు, జపయజ్ఞంలో పదహారో భాగానికి కూడా సరిరావు. ఈ చెప్పిన జప మహాత్మ్యం వాచికంగా చేసే జపానికే, దీనికి శతాధికంగా ఉపాంశు జపానికి, సహస్రాధికంగా మానసిక జపానికి మాహాత్మ్యం అధికమని శాస్త్రం చెబుతుంది.

## శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్ర పురశ్చరణ సంఖ్య

**పురశ్చరణ :**

పై తెలిపిన శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్రాన్ని 1 లక్షసార్లు జపించాలి. ఈ 1లక్ష జపాన్ని సాధకుని శక్త్యానుసారం 11-21-40 రోజులలో పూర్తి చేయవచ్చు.

సాధారణంగా ఏ మంత్రాన్నైనా 1 లక్ష జపం పురశ్చరణకు చేస్తే సరిపోతుంది. కాబట్టి ఇక్కడ తెలియజేసే పురశ్చరణ అంగాల వివరాలన్నీ 1 లక్ష జపాన్ని అనుసరించి చెప్పబడుతున్నాయి. ఈ విషయాన్ని సాధకులు గమనించగలరు.

# పురశ్చరణ అంగాలు

**శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్ర దశాంశ హోమం :**

శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్ర పురశ్చరణలో భాగంగా నియమ పూర్వకంగా ఒక లక్షసార్లు **(1000 మాలలు)** జపం చేసిన తరువాత అందులో దశాంశం అనగా పదివేల సార్లు మూలమంత్రంతో హోమాన్ని చేయాలి.

**హోమ సంకల్పం :**

మమోపాత్త సమస్త దురితక్షయ ద్వారా శ్రీ సుబ్రహ్మణ్య దేవతా ముద్దిస్య శ్రీ సుబ్రహ్మణ్య దేవతా ప్రీత్యర్థం. శ్రీ సుబ్రహ్మణ్యదేవతా మంత్ర పురశ్చరణాంగత్వేన **శ్రీ సుబ్రహ్మణ్య దేవతామంత్ర హవనం కరిష్యే** అని సంకల్పం చెప్పుకొని హోమాన్ని ప్రారంభించాలి.

**(హోమ విధానం ప్రత్యేకంగా తెలియచేయబడింది.)**

## శ్రీ సుబ్రహ్మణ్య దేవతా హోమ మంత్రం

ఓం శ్రీం హ్రీం క్లీం సం శరవణభవాయ స్వాహా స్వాహా

**సమర్పణ :**

ఈ విధంగా మూలమంత్రంతో 10వేల సార్లు హోమం చేసిన తరువాత చివరగా "అనేన మయాకృతేన శ్రీ సుబ్రహ్మణ్య దేవతామంత్ర హవనేన శ్రీ సుబ్రహ్మణ్య దేవతా సుప్రీతో సుప్రసన్నో వరదోభవతు. శ్రీ సుబ్రహ్మణ్య దేవతా ప్రీత్యర్థం ఏతత్ఫలం సర్వం శ్రీ సుబ్రహ్మణ్య దేవతా చరణారవిందార్పణమస్తు, తత్సద్బ్రహ్మార్పణమస్తు" అని ఉద్ధరిణతో నీళ్ళు హోమకుండంలోకి వదలాలి. తరువాత హోమ భస్మాన్ని నుదుట ధరించాలి.

## శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్ర తర్పణం

**తర్పణ సంకల్పం :**

జప దశాంశం హోమాన్ని చేసిన తరువాత అదే మంత్రంతో హోమ దశాంశం అనగా ఒక **వేయిసార్లు** తర్పణ చేయాలి.

"మమోపాత్త సమస్త దురితక్షయ ద్వారా శ్రీ సుబ్రహ్మణ్య దేవతా ముద్దిస్య శ్రీ సుబ్రహ్మణ్య దేవతా ప్రీత్యర్థం. శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్ర పురశ్చరణాంగత్వేన శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్ర తర్పణం కరిష్యే" అని సంకల్పం చెప్పుకొని తర్పణాన్ని ప్రారంభించాలి.

**ఒక పళ్ళెంలో శ్రీ సుబ్రహ్మణ్య స్వామి యంత్రాన్ని గాని, శ్రీ సుబ్రహ్మణ్యస్వామి మంత్రం లిఖించిన రాగి రేకును గాని ఉంచి,** గంధపుష్పాలతో అర్చించి కొంచెం పన్నీరు కలిపిన ఆవుపాలతో లేదా శుద్ధ జలంతో తర్పణం చెయ్యాలి.

## తర్పణ మంత్రం

ఓం శ్రీం హ్రీం క్లీం సం శరవణభవాయ స్వాహా
శ్రీ సుబ్రహ్మణ్య దేవతాం తర్పయామినమః

**తర్పణ సమర్పణ :**

"అనేన మయాకృతేన శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్ర తర్పణేన శ్రీ సుబ్రహ్మణ్య దేవతా సుప్రీతో సుప్రసన్నో వరదో భవతు. శ్రీ సుబ్రహ్మణ్య దేవతా ప్రీత్యర్థం ఏతత్ఫలం సర్వం శ్రీ సుబ్రహ్మణ్య దేవతా చరణారవిందార్పణమస్తు, తత్సద్బ్రహ్మార్పణమస్తు" అని ఉద్ధరిణతో నీళ్ళు ఒక పళ్ళెంలోకి వదలాలి. దీనితో తర్పణం పూర్తవుతుంది.

## శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్ర మార్జనం లేదా అభిషేకం

**అభిషేక సంకల్పం :**

ఇలా మంత్రంతో తర్పణ చేసిన తరువాత అందులో పదోవంతు అనగా **100** సార్లు మార్జనం లేదా అభిషేకం చేయాలి.

"మమోపాత్త సమస్త దురితక్షయ ద్వారా శ్రీ సుబ్రహ్మణ్య దేవతా ముద్దిస్య శ్రీ సుబ్రహ్మణ్య దేవతా ప్రీత్యర్థం. శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్ర పురశ్చరణాంగత్వేన శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్ర అభిషేకం కరిష్యే" అని సంకల్పం చెప్పుకొని, ఒక పంచపాత్రలో ఆవుపాలు లేదా నీరు తీసుకుని వాటితో ఒక పెద్దపళ్ళెంలో **శ్రీ సుబ్రహ్మణ్య యంత్రాన్ని గానీ, మంత్రం లిఖించిన రాగి రేకును గాని, ఉంచి** వాటిపై పువ్వుతోగాని, ఉద్ధరిణతో గాని అభిషేకం చేయాలి.

## అభిషేక మంత్రం

**ఓం శ్రీం హ్రీం క్లీం సం శరవణభవాయ స్వాహా**
**శ్రీ సుబ్రహ్మణ్య దేవతాం అభిషించామి నమః**

**అభిషేక సమర్పణ :**

"అనేన మయాకృతేన శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్ర అభిషేకేన శ్రీ సుబ్రహ్మణ్య దేవతా సుప్రీతో సుప్రసన్నో వరదో భవతు. శ్రీ సుబ్రహ్మణ్య దేవతా ప్రీత్యర్థం ఏతత్ఫలం సర్వం శ్రీ సుబ్రహ్మణ్య దేవతా చరణారవిందార్పణమస్తు, తత్సద్బ్రహ్మార్పణమస్తు" అని ఉద్ధరిణతో నీళ్ళు అరివేణం (ఒక పళ్ళెం)లోకి వదలాలి. దీనితో అభిషేకం పూర్తవుతుంది.

## బ్రాహ్మణ భోజనం

**బ్రాహ్మణ భోజన సంకల్పం :**

పురశ్చరణలో భాగంగా **100** సార్లు అభిషేకం చేసిన తరువాత అందులో పదోవంతు అనగా **10** మంది బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి.

"మమోపాత్త సమస్త దురితక్షయ ద్వారా శ్రీ సుబ్రహ్మణ్య దేవతా ముద్దిస్య శ్రీ సుబ్రహ్మణ్య దేవతా ప్రీత్యర్థం. శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మూలమంత్ర పురశ్చరణాంగత్వేన **బ్రాహ్మణ భోజనం (అన్నసంతర్పణం)** కరిష్యే" అని సంకల్పం చెప్పుకొని 10 మందికి తృప్తిగా ఆదరంగా భోజనం పెట్టుకోవాలి. ఇది శాస్త్ర నియమమైనప్పటికీ, ఏ వర్ణంవారినైనా పదిమందిని పిలిచి భోజనం పెట్టుకోవచ్చు.

**సమర్పణ :**

ఈ విధంగా అన్న వితరణ చేసిన తరువాత "అనేన మయాకృతేన శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్ర పురశ్చరణాంగత్వేన అన్నసంతర్పణేన శ్రీ సుబ్రహ్మణ్య దేవతా సుప్రీతో సుప్రసన్నో వరదోభవతు. శ్రీ సుబ్రహ్మణ్య దేవతా ప్రీత్యర్థం ఏతత్ఫలం సర్వం శ్రీ సుబ్రహ్మణ్య దేవతా చరణారవిందార్పణమస్తు, తత్సద్బ్రహ్మార్పణమస్తు" అని ఉద్ధరిణతో నీళ్ళు అరివేణం (ఒక పళ్ళెం)లోకి వదలాలి. అలా వదిలిన నీటిని **3** సార్లు తీర్థంగా స్వీకరించాలి.

***దీనితో శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్ర పురశ్చరణ పూర్తవుతుంది.***

**పురశ్చరణ-స్త్రీలు :**

పురుషులు శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్రాన్ని పురశ్చరణ పూర్వకంగా, పంచాంగ సహితంగా అనుష్ఠానం చేస్తేనే సంపూర్ణ ఫలితం లభిస్తుంది. అదే స్త్రీల విషయంలో పురశ్చరణ విషయమై మంత్ర శాస్త్రం వారికి కొంత సౌలభ్యాన్ని ఇచ్చింది.

**నియమః పురుషే జ్ఞేయా న యోషిత్సు కదాచన**
**న న్యాసా యోషితాం చాత్ర న ధ్యానం న చ పూజనం**
**కేవలం జపమాత్రేణ మంత్రాః సిద్ధ్యన్తి యోసితామ్ ॥**

మంత్ర పురశ్చరణ గురించి ఇంతకు ముందు చెప్పిన నియమాలన్నీ పురుషులకు మాత్రమే. న్యాసం, ధ్యానం, పూజ ఇవేవీ చేయలేక పోయినప్పటికీ స్త్రీలకు కేవలం జపంతోనే మంత్రం సిద్ధిస్తుంది.

అయితే శాస్త్రరీత్యా స్త్రీలకు పై విధంగా వెసులుబాటు కలిగినప్పటికీ అవకాశం వున్నవారు శక్తి కలిగినవారు పంచాంగ పూర్వకంగా పురశ్చరణ చేస్తేనే మంచిది.

**పురశ్చరణ నియమాలు :**

పురశ్చరణ చేసే సాధకులు తాము జపం చేసినన్ని రోజులూ కొన్ని నియమాలు పాటించాలి. అవి ఏమిటంటే....

**భూశయ్యా బ్రహ్మచారిత్వం మౌనమాచార్య సేవనం**
**నిత్యం త్రిషమాణ స్నానం క్షుర కర్మ నిసర్జనం**

భూమి మీద పడుకోవటం, బ్రహ్మచర్యాన్ని పాటించటం, ఎక్కువసేపు మౌనంగా వుండటం, పెద్దల గురువుల సేవ చేయటం, ప్రతిరోజూ మూడుసార్లు స్నానం చెయ్యటం, క్షవరం చేయించుకోకుండా వుండటం అనేవి ప్రధానంగా పాటించాల్సిన నియమాలు. అలాగే ఆహారం కూడా ఒక పూట భోజనం, రాత్రికి ఫలహారం చేస్తే మంచిది.

# గ్రహణ పురశ్చర్య

మంత్ర సాధనలకు సూర్య చంద్ర గ్రహణాలు ఎంతో విశేషమైనవిగా శాస్త్రాలలో చెప్పబడ్డాయి. సాధారణ దినాలలో కంటే అధిక తరమైన ప్రభావాన్ని సూర్య, చంద్ర గ్రహణాలు కలిగి వుంటాయి. కనుక ఈ సమయాలలో మంత్రసాధన ఉత్తమ ఫలితాన్ని సత్వరసిద్ధిని ఇస్తుంది.

**గ్రహణేర్కస్య చేందోర్వా శుచిః పూర్వముపోషితః**
**నద్యాం సముద్రగామిన్యాం నాభిమాత్రోదకే స్థితః**
**స్పర్శాద్విముక్తి పర్యంతం జపేన్మంత్ర మనన్యధీః ॥**

సూర్య లేక చంద్ర గ్రహణాలు కలిగిన సమయంలో నది వద్దగానీ, సముద్రతీరానికి గానీ వెళ్ళి, నదిలోనైతే బొడ్డులోతు నీళ్ళలో నిలబడి, సముద్రం వద్దనైతే తీరంలో దర్భాసనం మీద కూర్చునిగానీ, ఆచమనం ప్రాణాయామం చేసిన తరువాత. **మమోపాత్త సమస్త దురితక్షయ ద్వారా శ్రీ సుబ్రహ్మణ్య దేవతా ముద్దిస్య, శ్రీ సుబ్రహ్మణ్య దేవతా ప్రీత్యర్థం - గోత్రోద్భవస్య - నామధేయస్య అహం. పవిత్ర - గ్రహణకాలే. స్పర్శాది మోక్షపర్యంతం శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్ర జపం కరిష్యే...** అని సంకల్పం చెప్పుకుని గ్రహణం ప్రారంభ సమయం నుండి గ్రహణం విడిచేదాకా జపాన్ని చేయాలి. దీనికి ముందు గ్రహణం పట్టు స్నానం - జపం తరువాత విడుపు స్నానం చెయ్యాలి. జపం పూర్తయిన తరువాత ముందు చెప్పిన విధంగానే జపసమర్పణ చెయ్యాలి. దీనిని గ్రహణ పురశ్చర్య అంటారు. గ్రహణం పట్టినప్పటి నుండి విడిచేవరకూ ఉన్న సమయం అది 1 గంటైనా అరగంటైనా ఆ సమయంలో చేసిన జపం (సంఖ్యతో పనిలేదు) 1 లక్ష జపంతో సమానం.

కాబట్టి గ్రహణ సమయాన్ని వినియోగించుకుంటే సాధకులకు మంచిది. గ్రహణం తరువాత రోజు లేదా మంచిరోజు పురశ్చరణలో చెప్పిన విధంగా పదివేల హోమం ఒకవేయి తర్పణం ఒక వంద మార్జనం లేదా అభిషేకం, పది మంది బ్రాహ్మణుల భోజనం యధావిధిగా చేయాలి. **గ్రహణ జపం వల్ల కేవలం జప సంఖ్య మాత్రమే కలిసి వస్తుంది,** హోమాది మిగతా విధులు యధాతథం. కొందరి అభిప్రాయం ప్రకారం గ్రహణ కాలంలో చేసిన జపం పూర్తి పురశ్చర్యతో సమానం.

## హోమం చేసేడప్పుడు వాడే ప్రధాన వస్తువులు

**1. స్రువము :** చంద్రకొయ్యతో చేసిన చిన్నమూతిగల గరిటె ఒక మూరపొడవు గలది.

**2. స్రుక్కు:** చంద్రకొయ్యతో చేసిన పెద్ద మూతిగల గరిటె ఒక మూరపొడవు గలది.

**3. మృగముద్ర :** బొటనవేలు – మధ్య – ఉంగరపువేళ్ళు కలిపితే వచ్చేది.



వీటి మధ్యలోకి ఎంత వస్తే అంత పరిమాణంతోనే ద్రవ్యాలను ఆహుతిగా వేయాలి. హోమం చేసేడప్పుడు ఆజ్యాన్ని, తైలాన్ని, స్రువంతో వేయాలి. నువ్వులు, ఆవాలు వంటి ఇతర పదార్థాలను మృగముద్రతో వేయాలి.



**మృగముద్ర**

**స్రుక్కు - స్రువము**

## హోమకుండం - అగ్ని యంత్రము



## హోమ విధానం

శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్రాన్ని పురశ్చరణ పూర్వకంగా ఉపాసించే సాధకుడు. పురశ్చరణలో భాగంగా మూలమంత్ర జపంలో దశాంశం హెూమం చేయాలి. అని చెప్పటం జరిగింది. అయితే ఈ హెూమాన్ని ఎలా చేయాలి? హెూమం చేసేడప్పుడు మంత్రాన్ని ఎలా వినియోగించాలి? అంటే...

### హోమం చేసేటప్పుడు వినియోగించవలసిన సుబ్రహ్మణ్య మంత్రం

ఓం శ్రీం హ్రీం క్లీం సం శరవణభవాయ స్వాహా స్వాహా

హోమం చేసేడప్పుడు మూలమంత్రం చివర ఒక స్వాహా చేర్చి హోమం చెయ్యాలి కాబట్టి శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్రానికి చివర అదనంగా స్వాహా చేర్చటమైనది.

## హోమాధికారం

శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్రాన్ని పురశ్చరణ పూర్వకంగా ఉపాసించే విధానంలో 'హెూమం' అనేది ఒక ప్రధాన అంగంగా చెప్పబడింది. లోకంలో వైదిక సంప్రదాయాన్ని అనుసరించి ఉపవీతులైన బ్రాహ్మణులు మాత్రమే హోమం చేయటానికి అర్హులు అయితే తంత్రశాస్త్రానుసారంగా జపించిన మంత్రాలతో హోమాన్ని చేయటానికి అన్ని వర్ణాలవారూ అర్హులే. ఈ విషయమే మేరుతంత్రం, మంత్రమహార్ణవం, మంత్ర మహోదధి అనే ప్రసిద్ధ గ్రంథాలు చెబుతాయి.

కనుక (ఈ పుస్తకంలో తెలిపిన విధంగా) తాంత్రిక హోమవిధాన పద్ధతిలో స్త్రీలు, పురుషులు అన్ని వర్ణాలవారు స్వయంగా హెూమం చేసుకోవచ్చు.

ఇందులో 1) హోమ విధానము 2) లఘుహోమ విధానము అని రెండు పద్ధతులు చెప్పబడ్డాయి. సాధకుల శక్త్యానుసారం, సమయానుసారం ఏ పద్ధతినైనా ఆచరించవచ్చు. ఫలితం ఒక్కటే.

## శ్రీ సుబ్రహ్మణ్య మంత్ర హోమ విధానము

దేవతా ప్రీతి కోసం మంత్ర పురశ్చరణలో భాగంగా జపం చేసిన దానిలో దశాంశం హోమం చేయాలి. హోమ విధానాలు రెండు విధాలు.

1) వైదిక పద్ధతిలో చతుష్పాత్ర, షట్పాత్ర ప్రయోగానుసారంగా వుండేది.

2) తంత్రపరమైన విధి విధానాలతో వుండేది.

వీటిలో రెండోదైన తాంత్రిక హోమ విధానం అన్ని వర్ణాల వారినీ ఉద్దేశించి చెప్పబడింది. మంత్ర మహొదధి, మంత్ర మహార్ణవం, శారదాతిలకం లాంటి సుప్రసిద్ధ మంత్ర గ్రంథాలలో ఈ తాంత్రిక పద్ధతిలో హోమవిధానం ఎలా చేయాలో వివరంగా చెప్పారు. ఇవి పరమ ప్రామాణికమైన తంత్రశాస్త్ర గ్రంథాలు.

మంత్ర మహోదధిలోని ప్రథమతరంగంలో 103 నుంచి 206 శ్లోకాలలో, అలాగే శారదా తిలకతంత్ర గ్రంథంలోని పంచమపటలంలో, తాంత్రిక హోమవిధానం వివరంగా చెప్పబడింది.

ఇక్కడ మీకు పై తెలిపిన గ్రంథాలలో చెప్పిన హోమ విధానాన్నే తెలియచేస్తున్నాం. నేడు ఆంధ్రదేశంలో చాలామంది ఈ పద్ధతిలో హోమాలు ఆచరిస్తూ సత్ఫలితాలు పొందుతున్నారు. కనుక అందరూ హోమ ప్రక్రియను ఆచరించి మంత్రసిద్ధిని, దేవతానుగ్రహాన్ని పొంది తరించవలసిందిగా మనవి.

### గణపతి స్తుతి

**శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ।**
**ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥**

#### ఆచమనము

ఓం కేశవాయస్వాహా
ఓం నారాయణాయ స్వాహా
ఓం మాధవాయ స్వాహా

ఓం సంకర్షణాయ నమః
ఓం వాసుదేవాయ నమః
ఓం ప్రద్యుమ్నాయ నమః

ఓం గోవిందాయ నమః
ఓం విష్ణవే నమః
ఓం మధుసూదనాయ నమః
ఓం త్రివిక్రమాయ నమః
ఓం వామనాయ నమః
ఓం శ్రీధరాయ నమః
ఓం హృషీకేశాయ నమః
ఓం పద్మనాభాయ నమః
ఓం దామోదరాయ నమః
ఓం అనిరుద్ధాయ నమః
ఓం పురుషోత్తమాయ నమః
ఓం అధోక్షజాయ నమః
ఓం నారసింహాయ నమః
ఓం అచ్యుతాయ నమః
ఓం ఉపేంద్రాయ నమః
ఓం జనార్ధాయ నమః
ఓం హరయే నమః
ఓం శ్రీకృష్ణాయ నమః

శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్ర పురశ్చరణలో భాగంగా దశాంశం హోమం చేసేడప్పుడు ఎటువంటి కోరిక కోరకుండా కేవలం శ్రీ సుబ్రహ్మణ్యదేవతా ప్రీత్యర్థం, అనుగ్రహ సిద్యర్థం అని మాత్రమే సంకల్పించి హోమం చేయాలి. పురశ్చరణ అనేది దేవతను వరం కోరుకోవటానికి అర్హత మాత్రమే. ఒకసారి పురశ్చరణ పూర్తయినాక సాధకులు ఎప్పుడైనా ఎన్నిసార్లయినా కామ్య హోమాన్ని చేసుకోవచ్చు.

## హోమ సంకల్పము

అస్యశ్రీ మహావిష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య ఆద్య బ్రహ్మణః ద్వితీయపరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రధమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే మేరోః దక్షిణ దిగ్భాగే – దేశే భగవత్సన్నిధౌ అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన – సంవత్సరే ఆయనే – ఋతౌ – మాసే పక్షే – తిథౌ – వాసరే – నక్షత్రే శుభయోగే శుభకరణే ఏవం గుణ విశేషణ విశిష్టాయాం – గోత్రోద్భవస్య – నామధ్యేయస్య అహం శ్రీ సుబ్రహ్మణ్య దేవతా ప్రీత్యర్థం, శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మూలమంత్ర హోమం కరిష్యే.

## కలశపూజ

**కలశస్యముఖే విష్ణుః కంఠే రుద్రస్సమాశ్రితః ।**
**మూలే తత్రస్థితో బ్రహ్మ మధ్యే మాతృగణాః స్మృతాః ॥**
**కుక్షౌతు సాగరా స్సర్వే సప్తద్వీపా వసుంధరా ।**
**ఋగ్వేదో థ యజుర్వేదః సామవేదో హ్యథర్వణః ॥**

అంగైశ్చ సహితా సర్వే కలశాంబు సమాశ్రితాః ।
ఆయాంతు దేవపూజార్థం దురితక్షయ కారకాః ॥
గంగే చ యమునే చైవ గోదావరి సరస్వతి ।
నర్మదే సింధు కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు ॥

ఓం భూః ఓం భువః ఓం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓగ్ం సత్యం
ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్.
ఓం ఆపోజ్యోతీరసోమృతం బ్రహ్మభూర్భువస్సువరోమ్.

**దీప ప్రజ్వలనం :**

ముందుగా ఒక ప్రమిద లేదా కుందిలో ఆవునేతితో దీపారాధన చెయ్యాలి. ఈ దీపం, హోమం పూర్తయ్యే వరకు వెలుగుతూ ఉండేలా చూడాలి.

## గురుస్తుతి

గురుర్బ్రహ్మ, గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరం బ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః ॥

## శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్ర న్యాసములు

### కరన్యాసం

| | | |
|---|---|---|
| హ్రాం హిరణ్యవర్ణాయ | – | అంగుష్ఠాభ్యాం నమః |
| హ్రీం ప్రతీకారనికేతనాయ | – | తర్జనీభ్యాం నమః |
| హ్రూం సంకల్పసాధనాయ | – | మధ్యమాభ్యాం నమః |
| హ్రైం ఇక్షుధనుర్ధరాయ నమః | – | అనామికాభ్యాం నమః |
| హ్రౌం శిఖివాహనాయ నమః | – | కనిష్ఠికాభ్యాం నమః |
| హ్రః శక్తిహస్తాయ నమః | – | కరతలకరపృష్ఠాభ్యాం నమః |

## హృదయన్యాసం

| | | |
|---|---|---|
| హ్రాం హిరణ్యవర్ణాయ | – | హృదయాయ నమః |
| హ్రీం ప్రతీకారనికేతనాయ | – | శిరసేస్వాహా |
| హ్రూం సంకల్పసాధనాయ | – | శిఖాయైవషట్ |
| హ్రైం ఇక్షుధనుర్ధరాయ నమః | – | కవచాయ హుం |
| హ్రౌం శిఖివాహనాయ నమః | – | నేత్రత్రయాయౌషట్ |
| హ్రః శక్తిహస్తాయ నమః | – | అస్త్రాయ ఫట్ |

**భూర్భువస్సువరోమితి దిగ్బంధః**

**శ్రీ సుబ్రహ్మణ్య దేవతా ధ్యానం :**

**కనకమండల మండితం షణ్ముఖం**
**వనజరాజవిరాజిత లోచనమ్ ।**
**నిశితశస్త్ర శరాసన ధారిణం**
**శరవణోద్భవమీశసుతం భజే ॥**

## హోమకుండపూజ

హోమకుండంలోగానీ, స్థండిలం మీదగాని సంస్కార చతుష్టయము చేయాలి. మధ్యలో బియ్యపు పిండితో ప్రాదేశమాత్రపు (బొటనవ్రేలు, చూపుడువ్రేలు చాచినప్పుడు మధ్యలో ఉండే దూరము) చతురస్రము తయారు చేయాలి.

**వీక్షణము :**

ఓం శ్రీం హ్రీం క్లీం సం శరవణభవాయ స్వాహా

అని మూలమంత్రమును ఉచ్చరిస్తూ కుండమును చూడాలి.

**ప్రోక్షణము : ఫట్** అని ఉచ్చరిస్తూ దర్భలతో నీళ్ళు చల్లాలి.

**తాడనము :** దర్భలతో **ఫట్** అని మూడుసార్లు ఉచ్చరిస్తూ కుండము లోపలి భాగమును కొట్టాలి.

**అభ్యుక్షణము : హుం** అని ఉచ్చరిస్తూ పిడికిలితో నీళ్ళు కుండమంతట చల్లాలి.

**ఓం శ్రీం హ్రీం క్లీం సం శరవణభవాయ స్వాహా**

అని శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్రమును ఉచ్చరిస్తూ **"శ్రీ సుబ్రహ్మణ్య దేవతా హోమకుండాయనమః"** అని కుండమునకు నమస్కరించాలి.

తూర్పువైపు దర్భల చివరలు వచ్చుచున్నట్లుగా పడమట నుంచి తూర్పు వైపుకు మూడు గీతలు బియ్యపు పిండితో దర్భతో గీయవలెను. ఉత్తరపు వైపు దర్భ చివరలు వచ్చునట్లుగా మొదట గీసిన గీతలపై దక్షిణము నుంచి ఉత్తరము వైపు మూడు గీతలు గీయాలి.




ఆ దర్భలను త్రుంచి నైరుతి దిక్కువైపునకు వేయాలి.

తూర్పు రేఖలు చివరల మూడింటిని–**ముకుందాయ నమః, ఈశాయ నమః, పురందరాయ నమః** అని ప్రదక్షిణ క్రమమున పూజించాలి.

ఉత్తారగ్రములో – **బ్రహ్మణేనమః, వైవస్వతాయనమః, ఇంద్రవేనమః** అని పూజించాలి.

**ఓం హ్రీం ఓం** అని కుండ మధ్యమున వ్రాసి **శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్రమును** ఉచ్చరిస్తూ పుష్పాంజలి సమర్పించాలి.

## అగ్ని ప్రతిష్ఠాపనము

హోమాంగత్వేన అగ్ని ప్రతిష్ఠాపనం కరిష్యే – అని సంకల్పం చేయాలి,... అస్య శ్రీ వైశ్వానర మహామంత్రస్య భృగు ఋషిః, దేవీ గాయత్రీ ఛందః, శ్రీ వైశ్వానరో

దేవతా, **రం** బీజం, **స్వాహా** శక్తిః **జాతవేద** ఇతి కీలకం స్వేచ్ఛాప్రయోగ సిద్ధ్యర్థే హోమే వినియోగః అని సంకల్పంచేసి తరువాత అగ్నిన్యాసం చేయాలి.

## అగ్ని న్యాసము

**ఈ క్రింద తెలిపిన మంత్రాలతో కరన్యాసం, హృదయన్యాసం చేయాలి**

**1.** ఓం **రాం** సహస్రార్చిషే అంగుష్ఠాభ్యాం నమః, **2.** ఓం **రీం** స్వస్తిపూర్ణాయ తర్జనీభ్యాం నమః, **3.** ఓం **రూం** ఉత్తిష్ఠ పురుషాయ మధ్యమాభ్యాం నమః **4.** ఓం రైం ధూమవ్యాపినే అనామికాభ్యాం నమః **5.** ఓం **రౌం** సప్తజిహ్వాయ **కనిష్ఠికాభ్యాం నమః** **6.** ఓం **రః** ధనుర్ధరాయ కరతల కరపృష్టాభ్యాం నమః (ఇదే విధంగా హృదయన్యాసం కూడా చేయాలి.)

**భూర్భువస్సువరోమితి దిగ్బంధః**

**అగ్నిపీఠ పూజ** (కుండములో దశదిక్కుల యందు అక్షతలతో)

| | |
|---|---|
| 1. ఓం పీతాయై నమః | 6. ఓం తీవ్రాయై నమః |
| 2. ఓం శ్వేతాయై నమః | 7. ఓం విస్ఫులింగిన్యై నమః |
| 3. ఓం అరుణాయై నమః | 8. ఓం రుధిరాయై నమః |
| 4. ఓం కృష్ణాయై నమః | 9. ఓం జ్వాలిన్యై నమః |
| 5. ఓం ధూమ్రాయై నమః | 10. ఓం రం సర్వశక్తి కమలాసనాయై నమః |

**ఆసన పూజ – (అక్షతలతో)**

**రం వహ్న్యాసనాయనమః –** అని అగ్ని ఆసనమునకు నమస్కరించాలి. సపరివారం అగ్నిం ఆవాహయామి అని ఆవాహనం చేయాలి. అగ్నిని మూతగల పాత్రలో **'ఫట్ ఫట్'** అని ఉచ్చరిస్తూ తెచ్చి, **'హుం-హుం'** అని మూత తీసి, **'రం రం'** అని ఉచ్చరిస్తూ కుండము దగ్గరకు తీసుకొని రావాలి.

పరమాత్మ అను అగ్నితోను, జఠరాగ్నితోను, అంతరాగ్నితోను ఈ అగ్నియొక్క సమైక్యమును సంభావించి, అగ్ని బీజమగు **రం** ఉచ్చరిస్తూ వహ్ని చైతన్యమును భావించాలి.

అగ్నిని **ఓం**కారముతో అభిమంత్రించి, ఉచ్చరిస్తూ అమృతబీజమైన **వం-తో** అమృతీకరించి ఉచ్చరిస్తూ, ఈ అగ్ని లలాటం నుంచి కుండములోనికి దిగుచున్నట్లుగా భావించి, ఎనిమిదిసార్లు ప్రణవంతో **(ఓం)** మరల అభిమంత్రించి **హుం ఫట్** అని రక్షాకవచమును భావించి **"రం వహ్నిమూర్తయే నమః"** అని మనస్సులో అగ్నికి నమస్కరించి **ఓం ఓం ఓం** అని ఉచ్చరిస్తూ కుండముపై నిప్పు పళ్ళెమును ప్రదక్షిణ పద్ధతిలో మూడుసార్లు త్రిప్పాలి.

**హూంఫట్ క్రవ్యాదేభ్యః స్వాహా** అనుచు కొంత నిప్పు తీసి నైరుతి దిక్కున వేయాలి.

**భూర్భువస్సువరోం** అనియు, **హ్రూం-వహ్ని చైతన్యాయ నమః,** అనియు ఉచ్చరిస్తూ కుండమున అగ్నిని ఉంచాలి.

కుండము బైట (నిప్పు పళ్ళెములో) అక్షతలు, నీళ్ళు వదలాలి.

**చిత్పింగళ హనహన దహదహ పచపచ సర్వజ్ఞ ఆజ్ఞాపయ స్వాహా. హ్రీం హ్రీం జ్వల జ్వల ప్రజ్వల ప్రజ్వల హుంఫట్ స్వాహా –** అని మంత్రములను పఠించాలి. ఆ తరువాత లేచి నిలుచుండి జ్వాలినీముద్ర ప్రదర్శించి నమస్కరిస్తూ

**అగ్నిం ప్రజ్వలితం వందే జాతవేదం హుతాశనం ।**
**సువర్ణ వర్ణ మమలం సమిద్ధం విశ్వతోముఖం ॥**

**"ఓం వైశ్వానర జాతవేద ఇహా వహ లోహితాక్ష సర్వకర్మాణి సాధయ స్వాహా"** అనుచు అర్ఘ్యపాద్యములతో పూజించాలి.

## లమిత్యాది పంచపూజలు

పంచపాత్రలో నీటిని ఉద్ధరిణతో తీసుకుని ఓం అగ్నయే నమః **పాద్యం** సమర్పయామి **అర్ఘ్యం** సమర్పయామి **ఆచమనం** సమర్పయామి అంటూ అరివేణం (పళ్ళెం)లో వేయాలి.

**లం** పృథివీ తత్వాత్మికాయ నమః **గంధం** ధారయామి
**హం** ఆకాశ తత్వాత్మికాయ నమః **పుష్పైః** పూజయామి
**యం** వాయు తత్వాత్మికాయ నమః **ధూపం** అఘ్రాపయామి
**రం** తేజస్తత్వాత్మికాయ నమః **దీపం** దర్శయామి

అంటూ గంధాన్ని, పుష్పాలను, అగరబత్తీలను లేదా సాంబ్రాణీని హెూమకుండంలో వేసి దీపారాధన చేసిన దీపాన్ని హెూమకుండానికి చూపాలి.

**ధూపదీపానంతరం ఆచమనం సమర్పయామి**

**వం** అమృతతత్వాత్మికాయ నమః అమృత **నైవేద్యం** సమర్పయామి అంటూ నైవేద్యాన్ని హోమకుండంలో సమర్పించాలి. (సున్నుండ లేక పండు).

ఒక దర్భ కాల్చి జ్వాలను నేతిలో ప్రతిఫలింపజేసి, దర్భను కుండములో వేయాలి, నేతిపాత్రలో రెండు చిన్న దర్భాగ్రములు వేయాలి. అపుడు నెయ్యి మూడు భాగములు అగును. ఎడమవైపు **ఇడ**, కుడివైపు **పింగళ**, మధ్య **సుషుమ్న** అని భావించాలి.

స్రువముతో కుడిభాగము నుండి **'నమః'** అని నేతిని తీసుకొని **ఓం అగ్నయే స్వాహా** – అని ఆహుతి వేయుచు అగ్ని యొక్క ఎడమకన్ను తెరువబడినట్లుగా భావించాలి.

స్రువముతో మధ్యభాగము నుండి **'నమః'** అనుచు నేతిని తీసుకొని **ఓం అగ్నీషోమాభ్యాగ్ం స్వాహా** – అని ఆహుతి వేయుచు అగ్ని యొక్క మధ్యనేత్రం (మూడవకన్ను) తెరువబడినట్లుగా భావించాలి.

కుడివైపు నుండి **'నమః'** అని నేతిని తీసుకొని **ఓం అగ్నయే స్విష్టకృతే స్వాహా** అని అగ్ని ముఖమున ఆహుతి వేయాలి. ఆ తరువాత

మధ్యభాగము నుండి నేతిని తీసుకొని

**ఓం భూః స్వాహా, ఓం భువః స్వాహా**

**ఓం సువః స్వాహా, ఓం భూర్భువస్సువః స్వాహా**

అని 4 ఆహుతులు వేయాలి.

**ఓం వైశ్వానర జాతవేద ఇహా వహ లోహితాక్ష సర్వ కర్మాణి సాధయస్వాహా**

అని మూడుసార్లు ఆహుతులు వేయాలి.

## జిహ్వాహోమము (సాత్త్విక జిహ్వాలు)

1. ఓం స్ర్యూం హిరణ్యాయై స్వాహా
2. ఓం ఫ్ర్యూం గగనాయై స్వాహా
3. ఓం శ్రూం రక్తాయై స్వాహా
4. ఓం వ్ర్యూం కృష్ణాయై స్వాహా
5. ఓం ల్ర్యూం సుప్రభాయై స్వాహా
6. ఓం ర్ర్యూం అతిరక్తాయై స్వాహా
7. ఓం య్ర్యూం బహురూపాయై స్వాహా

## – రాజస జిహ్వాలు –

1. ఓం స్ర్యూం పద్మరాగాయై స్వాహా
2. ఓం ఫ్ర్యూం సువర్ణాయై స్వాహా
3. ఓం శ్రూం భద్రలోహితాయై స్వాహా
4. ఓం వ్ర్యూం లోహితాయై స్వాహా
5. ఓం ల్ర్యూం శ్వేతాయై స్వాహా
6. ఓం ర్ర్యూం ధూమిన్యై స్వాహా
7. ఓం య్ర్యూం కరాళికాయై స్వాహా

## – తామస జిహ్వాలు –

1. ఓం స్ర్యూం విశ్వమూర్త్యై స్వాహా
2. ఓం ఫ్ర్యూం విస్ఫులింగిన్యై స్వాహా
3. ఓం శ్రూం ధూమ్రవర్ణాయై స్వాహా
4. ఓం వ్ర్యూం మనోజవాయై స్వాహా
5. ఓం ల్ర్యూం లోహితాయై స్వాహా
6. ఓం ర్ర్యూం కరాళ్యై స్వాహా
7. ఓం య్ర్యూం కాళ్యై స్వాహా

**సాత్త్విక - రాజస - తామస జిహ్వాలు ఇష్టప్రాప్తి, అనిష్ట పరిహారము అభిచార ప్రయోజనములకు ఉద్దేశించబడ్డాయి.**

## – జిహ్వాధిదేవతా హోమము –

1. ఓం సురేభ్యః స్వాహా
2. ఓం పితృభ్యః స్వాహా
3. ఓం గంధర్వేభ్యః స్వాహా
4. ఓం యక్షేభ్యః స్వాహా
5. ఓం నాగేభ్యః స్వాహా
6. ఓం పిశాచేభ్యః స్వాహా
7. ఓం రాక్షసేభ్యః స్వాహా

## – షడంగ దేవతా హోమము –

1. ఓం **రాం** సహస్రార్చిషే హృదయాయ నమః స్వాహా
2. ఓం **రీం** స్వస్తిపూర్ణాయ శిరసే స్వాహా స్వాహా
3. ఓం **రూం** ఉత్తిష్ఠ పురుషాయ శిఖాయై వషట్ స్వాహా
4. ఓం **రైం** ధూమవ్యాపినే కవచాయ హుం స్వాహా
5. ఓం **రౌం** సప్తజిహ్వాయ నేత్రత్రయాయ వౌషట్ స్వాహా
6. ఓం **రః** ధనుర్ధరాయ అస్త్రాయ ఫట్ స్వాహా

## – అష్టమూర్తి హోమము –

1. ఓం అగ్నయే జాతవేదసే స్వాహా
2. ఓం అగ్నయే సప్తజిహ్వాయ స్వాహా
3. ఓం అగ్నయే హవ్యవాహనాయ స్వాహా
4. ఓం అగ్నయే అశ్వోదరజాయ స్వాహా
5. ఓం అగ్నయే వైశ్వానరాయ స్వాహా
6. ఓం అగ్నయే కౌమారజాతసే స్వాహా
7. ఓం అగ్నయే విశ్వముఖాయ స్వాహా
8. ఓం అగ్నయే దేవముఖాయ స్వాహా

## – అష్టమాతృక హోమము –

1. ఓం **ఆం** బ్రాహ్మ్యై స్వాహా
2. ఓం **ఈం** మహేశ్వర్యై స్వాహా
3. ఓం **ఊం** కౌమార్యై స్వాహా
4. ఓం **ఋూం** యక్షేభ్యః స్వాహా
5. ఓం **ౡం** వారాహ్యై స్వాహా
6. ఓం **ఐం** ఇంద్రాణ్యై స్వాహా
7. ఓం **ఔం** చాముండాయై స్వాహా
8. ఓం **అః** మహాలక్ష్మ్యై స్వాహా

## – అష్టభైరవ హోమము –

1. ఓం **అం** అసితాంగ భైరవాయ స్వాహా
2. ఓం **ఇం** రురు భైరవాయ స్వాహా
3. ఓం **ఉం** చండ భైరవాయ స్వాహా
4. ఓం **ఋం** క్రోధ భైరవాయ స్వాహా
5. ఓం **ఌం** ఉన్మత్త భైరవాయ స్వాహా
6. ఓం **ఐం** కపాల భైరవాయ స్వాహా
7. ఓం **ఓం** భీషణ భైరవాయ స్వాహా
8. ఓం **అః** సంహార భైరవాయ స్వాహా

## – దిక్పాలక హోమము –

1. ఓం **లం** ఇంద్రాయ స్వాహా
2. ఓం **రం** అగ్నయే స్వాహా
3. ఓం **హం** యమాయ స్వాహా
4. ఓం **షం** నిరృతయే స్వాహా
5. ఓం **వం** వరుణాయ స్వాహా
6. ఓం **యం** వాయవే స్వాహా
7. ఓం **సం** సోమాయ స్వాహా
8. ఓం **శం** ఈశానాయ స్వాహా
9. ఓం **ఆం** బ్రహ్మణే స్వాహా
10. ఓం **హ్రీం** అనంతాయ స్వాహా

## - దిక్పాలకాయుధ హోమము -

1. ఓం వజ్రాయ స్వాహా
2. ఓం శక్త్యై స్వాహా
3. ఓం దండాయ స్వాహా
4. ఓం ఖడ్గాయ స్వాహా
5. ఓం పాశాయ స్వాహా
6. ఓం అంకుశాయ స్వాహా
7. ఓం గదాయై స్వాహా
8. ఓం శూలాయ స్వాహా
9. ఓం పద్మాయ స్వాహా
10. ఓం చక్రాయ స్వాహా

ఈ విధంగా హోమాన్ని ఆచరించిన తరువాత స్రువముతో నాలుగుసార్లు నేతిని తీసుకొని స్రుక్కునందు వేసి స్రువమును స్రుక్కుపై బోర్లించి దానియందు ఒక పువ్వును ఉంచి రెండు చేతులతో వామస్తనము ఎత్తువరకు పట్టుకుని లేచి కుడికాలు ముందుకు వేసి **"ఓం వైశ్వానర జాతవేద ఇహా వహ లోహితాక్ష సర్వకర్మాణి సాధయ వౌషట్"** అని హోమము చేయాలి. తరువాత కూర్చుని కుండానికి నమస్కరించి చేతిలో అక్షతలు నీరు తీసుకొని కుండమునకు (అగ్నికి) తూర్పున నీళ్ళు మాత్రమే ఉంచి పశ్చిమాన అక్షతలు వేయాలి.

**ప్రాఙ్ముఖాగ్నే మమ అభిముఖోభవ, సుముఖోభవ**
**సుప్రసన్నోభవ, వరదో భవ, యథోక్త జిహ్వాయా**
**హావిర్గృహాణ ॥ఓం భూర్భువస్సువః**

అని నీళ్ళు చల్లి నీళ్ళతో అగ్నికి చుట్టూ ప్రదక్షిణ పద్ధతిన త్రిప్పాలి.

## - కుండమేఖలా పూజ -

1. తూర్పున–అగ్నయే నమః
2. అగ్నేయాన–హుతవహాయ నమః
3. దక్షిణాన–హుతాశినే నమః
4. నైరుతిన–కృష్ణవర్త్మనే
5. పశ్చిమాన–దేవముఖాయ నమః
6. వాయువ్యాన–సప్తజిహ్వాయ నమః
7. ఉత్తరాన – వైశ్వానరాయ నమః
8. ఈశాన్యాన–జాతవేదసే నమః

అనుచు ఎనిమిది దిక్కులయందు అక్షతలతో కుండముపై పూజ చేయాలి. దర్భల కొనలు తూర్పు వైపునకుగానూ, ఉత్తరవైపునకుగానూ ఉండేటట్లు నాలుగు వైపుల వేయాలి.

## - మహా గణపతి హోమము -



1. ఓం స్వాహా
2. ఓం శ్రీం స్వాహా
3. ఓం శ్రీం హ్రీం స్వాహా
4. ఓం శ్రీం హ్రీం క్లీం స్వాహా
5. ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం స్వాహా
6. ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం స్వాహా
7. ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే స్వాహా
8. ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే వరవరద స్వాహా
9. ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే వరవరద సర్వజనం స్వాహా
10. ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే వరవరద సర్వజనం మే స్వాహా
11. ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే వరవరద సర్వజనం మే వశమానయ స్వాహా స్వాహా

అని చెబుతూ 11 సార్లు ఆహుతులు వేయాలి.

పిమ్మట నాలుగుపర్యాయములు పూర్తి గణపతి మంత్రముతో ఆహుతులు వేయాలి.

## - ప్రధాన దేవతా హోమము -

శ్రీ గురుభ్యోనమః అని గురువునకు నమస్కరించి ఓం శ్రీ సుబ్రహ్మణ్య దేవతా యోగపీఠాయ నమః అని ఒక మారు ఆహుతిగానీ, అక్షతలుగానీ వేయాలి.

**ఓం శ్రీం హ్రీం క్లీం సం శరవణభవాయ స్వాహా**

అని శ్రీ **సుబ్రహ్మణ్య దేవతా మంత్రమును** పదిసార్లు ఉచ్చరించి దానితో దేవతను అగ్నియందు అవతరింప చేయాలి. దేవతా యంత్రమును కుండమునందు భావించి దేవతా ప్రాణ ప్రతిష్ఠ చేయాలి.

**ఓం ఆ హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం**

**ఓం క్షం సం హం సః హ్రీం ఓం హం సః** శ్రీ సుబ్రహ్మణ్య దేవతాప్రాణా ఇహ ప్రాణాః

**ఓం ఆం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం**

**ఓం క్షం సం హం సః హ్రీం ఓం హం సః** శ్రీ సుబ్రహ్మణ్యదేవతా జీవ ఇహస్థితః

**ఓం ఆం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం**

**ఓం క్షం సం హం సః హ్రీం ఓం హం సః**

**శ్రీ సుబ్రహ్మణ్య దేవతా సర్వేంద్రియాణి వాఙ్మనః చక్షుశ్రోత్ర**

**ఘ్రాణ ప్రాణా ఇహైవ ఆగత్య సుఖం చిరంతిష్ఠంతు స్వాహా**

**ఓం క్షం సం హం సః హ్రీం ఓం**

పై మొత్తము మంత్రమును మూడుసార్లు జపించుచు కుండముపై చేయి వుంచి ప్రాణప్రతిష్ఠ చేయాలి. ఆ తరువాత లమిత్యాది పంచపూజ చేయాలి.

## లమిత్యాది పంచపూజలు

పంచపాత్రలో నీటిని ఉద్ధరిణతో తీసుకుని శ్రీ సుబ్రహ్మణ్యదేవతాయై నమః **పాద్యం** సమర్పయామి **అర్ఘ్యం** సమర్పయామి **ఆచమనం** సమర్పయామి అంటూ హోమకుండంలో ఒక ప్రక్కగా వేయాలి.

**లం** పృథివీ తత్వాత్మికాయై శ్రీ సుబ్రహ్మణ్య దేవతాయై గంధం ధారయామి

**హం** ఆకాశతత్వాత్మికాయై శ్రీ సుబ్రహ్మణ్య దేవతాయై పుష్పైః పూజయామి

**యం** వాయుతత్వాత్మికాయై శ్రీ సుబ్రహ్మణ్య దేవతాయై ధూపం అఘ్రాపయామి

**రం** తేజస్తత్వాత్మికాయై శ్రీ సుబ్రహ్మణ్య దేవతాయై దీపం దర్శయామి

అని చెపుతూ ఉద్ధరణితో నీటిని ఐదు సార్లు అరివేణం (పళ్ళెం)లో వేయాలి.

**ధూపదీపానంతరం ఆచమనం సమర్పయామి**

**వం** అమృతతత్వాత్మికాయై శ్రీ సుబ్రహ్మణ్య దేవతాయై అమృత నైవేద్యం సమర్పయామి అని చెబుతూ గంధాన్ని, పుష్పాన్ని, ధూపాన్ని (అగరుబత్తి / సాంబ్రాణి) హోమకుండంలో వేసి దీపారాధన చేసిన దీపాన్ని చూపి, నైవేద్యంగా సున్నుండను కాని, పండ్ల ముక్కలను కాని హోమకుండములో వేయాలి.

ఇప్పుడు **అగ్ని - శ్రీ సుబ్రహ్మణ్య దేవతా ఏకీకరణార్థం పంచవింశతి ఆహుతిం హోష్యామి** అని అగ్నికి దేవతకు వక్ర ఏకీకరణమును సంకల్పించి మూలమంత్రముతో **25** ఆహుతులు వేయాలి.

తరువాత **అగ్ని-శ్రీ సుబ్రహ్మణ్య దేవతా నాడీ సంధానార్థం ఏకాదశ ఆహుతిం హోష్యామి** అని నాడీ సంధానమును సంకల్పించి, శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్రముతో 11 ఆహుతులు వేయాలి. ఇప్పటికి అగ్నికి దేవతకు ఏకీకరణము జరిగినట్లుగా భావించాలి.

**ఓం మండూకాది పరతత్వాంత పీఠదేవతాభ్యఃస్వాహా**

అని ఒక ఆహుతి వేయాలి.

ఏ ప్రదేశంలో అయితే హోమం చేస్తామో ఆ ఆవరణలోనే దేవతలకు ఆ పీఠంలోని దేవతలకు **ఓం సమస్త ఆవరణ దేవతాయై స్వాహా, ఓం సమస్త పీఠ దేవతాయై స్వాహా** అని పీఠదేవతలకు, ఆవరణ దేవతలకు ఒక్కొక్క ఆహుతి సమర్పించాలి. అనంతరం

ఓం శ్రీం హ్రీం క్లీం సం శరవణభవాయ స్వాహా స్వాహా

అని చెబుతూ శ్రీ సుబ్రహ్మణ్య దేవతా హోమ మంత్రముతో 10 ఆజ్యాహుతులు వేయాలి. ఆ తరువాత కామ్య ద్రవ్యములతో హోమము చేయాలి.

అగ్ని, దేవతా సంధానము చేయబడినది గనుక హోమములో **"ఇదం న మమ"** అవి త్యాగము చెప్పవలసి పనిలేదు.

## - హోమ ప్రారంభం -

ఓం శ్రీం హ్రీం క్లీం సం శరవణభవాయ స్వాహా స్వాహా

అనిపై మంత్రం చివర స్వాహా అని ఉచ్చరిస్తూ ఆహుతులు వేయాలి.

## - హోమాంత విధి -

ఇలా మూలమంత్రంతో హోమం పూర్తిచేసిన తరువాత హోమ పరిపూర్ణత కొరకు జయాది మంత్రములతో హోమము చేయాలి. జయాదుల బదులుగా మహావ్యాహృతి హోమము, బ్రహ్మార్పణ మంత్రహోమము చేయవచ్చును.

## - మహావ్యాహృతి హోమము -

ఓం భూః అగ్నయే చ పృధివ్యైచ మహతే చ స్వాహా

ఓం భువః వాయవే చ అంతరిక్షాయ చ మహతే చ స్వాహా

ఓం సువః ఆదిత్యాయ చ దివే చ మహతే చ స్వాహా

ఓం భూర్భువస్సువః చంద్రమసే చ నక్షత్రభ్యశ్చ దిగ్భ్యశ్చ మహతేచ స్వాహా

అని 4 ఆహుతులు వేయాలి.

## - బ్రహ్మార్పణ మంత్రహోమము -

ఓం తత్సత్ ఇతః పూర్వం ప్రాణబుద్ధి దేహ ధర్మాధికార జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థాసు మనసా వాచా కర్మణా యత్ స్మృతం యదుక్తం యచ్ఛకృతం తత్సర్వం బ్రహ్మార్పణం భవేత్. భూః స్వాహా స్వాహా

అనుచు **8** ఆహుతులు వేయాలి.

## - దేవతా బలి -

పూర్ణాహుతి ముందు 'మంచి గుమ్మడికాయ' మంత్ర పూర్వకముగా ఖండించి సమర్పించవచ్చును. ఇది ఆటంకములను, ఆపదలను తొలగించి అభీష్టములను ప్రసాదించును. లేదా కొబ్బరికాయ పూర్తిగా పీచుతీసి కుంకుమరాసి పగులకొట్టకుండ

**శ్రీ సుబ్రహ్మణ్య దేవతాయై బలిం సమర్పయామి**

అంటూ కుండములో వేయాలి.

## - పూర్ణాహుతి -

పూర్ణాహుతిని సంకల్పించి **'పూర్ణాహుతిం జుహోమి'** అని అనవలెను.

పళ్ళెమునందు కొబ్బరికాయగానీ, ఖర్జూరపు కాయగానీ, పోకకాయగాని ఉంచి అక్షతలు, జాజికాయ, పట్టుగుడ్డ, పూలు, జాపత్రి మున్నగు సుగంధ ద్రవ్యాలను పూర్ణాహుతికి ఉపయోగించవచ్చును.

పూర్ణాహుతి ద్రవ్యాన్ని ఒక దేవతగా భావించి ధూపదీప నైవేద్యములను సమర్పించాలి. **12సార్లు** మూలమంత్రముతో నేతిని తీసుకొని పూర్ణాహుతి ద్రవ్యపు కాయపై పోయవలెను. ఈ సందర్భమున స్రుక్కునందు స్రువముతో **12సార్లు** నేతిని వేసి పూర్ణాహుతి చేయుట ఆచారం. లేచి నుంచొని

ఓం శ్రీం హ్రీం క్లీం సం శరవణభవాయ స్వాహా వౌషట్

అని మూలమంత్రమును ఉచ్చరిస్తూ పూర్ణాహుతి ద్రవ్యాన్ని హోమకుండములో వేయాలి. ఇంతటితో పూర్ణాహుతి పూర్తవుతుంది.

హోమసమయాన అగ్నిజ్వాలతో బాగా విజృంభించినట్లు చూచుకొనవలెను. అయినను అప్పుడప్పుడు వాడిన ద్రవ్యాలను బట్టి జ్వాలలు బాగా ఉండకపోవచ్చును. కనుక, అగ్నివిహరణ దోషనిరసనార్థము శ్రీ సుబ్రహ్మణ్య దేవతా మంత్రముతో **25** ఆజ్యాహుతులను వేయాలి.

***తరువాత ఆవరణ దేవతలకు ఆహుతులు వేయాలి.***

## - దిక్పాలక బలి -

పూర్ణాహుతి అనంతరము, దిక్పాలకులకు ఎర్ర అన్నము ముద్దగాని, కోసి కుంకుమ అద్దిన నిమ్మకాయడిప్పగాని, గారెలు గాని ఈ క్రింది మంత్రములు చెప్పుచూ బలి సమర్పించాలి. కుండము బయట ఎనిమిది దిక్కులలో తమలపాకులు పెట్టి ఆయాదిక్కులలో వరుసగా బలి సమర్పణ చేయాలి.

1. తూర్పు-**లం** ఇంద్రాయ నమః
2. ఆగ్నేయము-**రం** ఆగ్నేయ నమః
3. దక్షిణము-**హం** యమాయ నమః
4. నైఋతి-**షం** నిఋతయే నమః
5. పడమర-**వం** వరుణాయ నమః
6. వాయవ్యము-**యం** వాయవే నమః
7. ఉత్తరం-**సం** సోమాయ నమః
8. ఈశాన్యము-**శం** ఈశానాయ నమః
9. ఊర్ధ్వం-**ఆం** బ్రహ్మణే నమః
10. అధో-**హ్రీం** అనంతాయ నమః

(ఈ పది దిక్కుల మంత్రాలకు చివర వున్న **నమః** తరువాత **బలిం సమర్పయామి** అని చెప్పవలెను)

## - భూత బలి -

హోమకుండానికి ఈశాన్యమున ఆకువేసి పెద్ద ఎర్ర అన్నము ముద్దపెట్టి ఈ క్రింది మంత్రముతో భూతములకు బలి సమర్పించాలి. లేదా కొబ్బరికాయకొట్టి కుంకుమవేసి నీరుచల్లి బలిని సమర్పించవచ్చును.

**యే రౌద్రా రౌద్రకర్మాణో రౌద్రస్థాన నివాసినః**
**యోగినోహ్యుగ్రరూపాశ్చ గణానాం అధిపాశ్చయే**
**భూచరాః ఖేచరాశ్చైవ యే తిష్ఠంత్యంతరిక్షగాః**
**తే సర్వే ప్రీతమనసో భూత్వా గృహ్ణం త్విమం బలిం**
**సర్వ విఘ్నకృద్భ్యః సర్వభూతేభ్యో హుంఫట్ స్వాహా**

అని చెప్పుచూ అక్షతలు, నీళ్ళు వదలవలెను. ఇక్కడ కొబ్బరికాయను భూతబలి కొరకు ఉపయోగించవచ్చు.

దిక్పాలిక బలిక్రింద మినుములు, పెరుగు కలిపి యిచ్చుట కొన్నిచోట్ల ఆచారము. నిమ్మకాయ కోసి కుంకుమ అద్ది కూడ ఇయ్యవచ్చు.

**చివరగా హోమకుండానికి నమస్కరించి 11సార్లు ప్రదక్షిణ చేసి కుండభస్మము నొసట ధరించి దేవతాప్రసాదమును స్వీకరించాలి.**

